# పెయింటింగ్‌లో అష్కన్ సంప్రదాయం

ఈ అష్కన్ చిత్రణ కళా సంప్రదాయాన్ని విమర్శకులు గ్రామ్యమని విమర్శించారు. అయినా ఈ సంప్రదాయం న్యూయార్క్ వీధి దృశ్యాల నుంచి, నగర జీవిత దుఃఖ భాజక పార్శ్యంనుంచి ఊపిరిని పీల్చుకొంది.

అమెరికా చిత్రకళ అంతిమంగా 20వ శతాబ్ది తొలి సంవత్సరాలలో ఐరోపా చిత్రకళా ఛాయల నుంచి బయటపడి, తన ప్రత్యేకతను గుర్తింపజేసుకొంది. ఈ రకం కళాకారుల బృందానికి నాయకుడు రాబర్ట్ హెన్రి. ఇతడి చిత్రాలు ఐరోపా కక్ష్యలోనే సాగినా, అతడి ప్రాముఖ్యం నూతన వాస్తవిక ఉద్యమానికి ఒక దిశను కల్పించడంలో ఉంది. ఇతడు ఐరోపాను అనేక సందర్భాలలో దర్శించాడు. చాలకాలం పారిస్, హాలండ్‌లలో అడోల్ఫ్ బొగరీ (1895) విలియమ్ గ్లాకెన్స్‌ల వద్ద అష్కన్ కళా సంప్రదాయాన్ని అధ్యయనం చేశాడు.

అమెరికాకు తిరిగి వచ్చి ఫిలడల్ఫియాలో స్థిరపడ్డాడు. ఇతడి స్టూడియో భావి అష్కన్ కళాకారులకు సమావేశ స్థలి అయింది. జార్జ్ ల్యూకాస్, ఎవరెట్‌షిన్, జాన్‌స్లో అన్, విలియమ్‌గ్లాకెన్స్ వీరంతా గూడ మొదట వార్తా పత్రికలలో బొమ్మలు వేయడంతో ప్రారంభించిన వారే. వీరందరిని పత్రికలలో బొమ్మలు వేయడంలో అవ్యవహితత్వాన్ని శీర్షికత్వాన్ని ఒక ధీరతతో గూడిన అమెరికా నూతన కళారూపంగా మలచమని హెన్రీ కోరాడు.

అతడికి ప్రగతి న్యాయం, సాధారణ మానవ బంధాలపట్ల విశ్వాసం ఉంది. వీటిని సకారాత్మక ఉదార మానవ వాదానికి పరివర్తితం చేయాలని బోధించాడు. అతడు కళాకారులను ఆధునిక అమెరికా జీవితాన్ని - పై పై అందాలను కాక - సామాజిక స్పృహతో చిత్రించమన్నాడు. "ఒక బొమ్మగా కనపడని బొమ్మను చిత్రించడానికి ఇష్టపడండి", అని చెప్పాడు.

ముఖ చిత్రం: "హిమ తుషార వీధి దృశ్యం"

(ఈ నవ్య వాస్తవికవాద ధోరణి అధునాతన అమెరికా జీవితం అన్ని ముఖాల నుంచి ఉత్తేజితం కావడానికి బిడియ పడడం లేదు)

# మిసిమి

**"All that we are is the product of what we have thought" is "We are what we think." - Dammapada.**

సంపుటి 13 | నవంబర్ 2001 | సంచిక 11

వ్యవస్థాపక సంపాదకుడు : **డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయ సూచిక

జీవిత ఆటుపోట్లనుండి సాహిత్య సృజన - బి.వి. రామిరెడ్డి

కళా సాహితీ సవ్యసాచిత్వం - మాకినీడి సూర్యభాస్కర్

కన్యాశుల్కము - డా॥ యు. ఏ. నరసింహమూర్తి

కవిత్వంగా సైన్సు - నాగసూరి వేణుగోపాల్

గ్రంథ సమీక్ష అను ఓ భయప్రకటన! - నరేష్ నున్నా

విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : **"హిమ తుషార వీధి దృశ్యం"**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyd - 20. Ph. 7645536
E-mail : misimieditor@rediffmail.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# నేను నేనే

''నేను ఎవరిని అని చాలమంది ప్రశ్నించుకొంటూ ఉంటారు. ఈ ప్రశ్నను గురించి మీరేమైనా ఆలోచించారా?'' అని **డా॥ రవీంద్రనాథ్**గారిని ఒకసారి నేను ( అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి ప్రస్తుత మిసిమి సంపాదకుడు) ప్రశ్నించినప్పుడు, ''వేదాంతులు మాటాడుకునే ఆత్మ ఏమిటో నాకు తెలియదు కాని, నా మాత్రానికి నేను దానికి ఈ విధంగా సమాధానం చెప్పుకొంటాను'' అన్నారు ఆయన.

''నేను నేనే. నేనుకు అర్థం చెప్పుకోవడానికి నేను నానుంచి బయటికి పోవలసిన పనిలేదు. జీవితంలో అనేక సన్నివేశాలు ఎదురవుతూ ఉంటాయి. వాటిల్లో నా పాత్రను నేను నిర్వహిస్తూ ఉంటాను. మామూలుగా ఈ పాత్రల పరంగా నేను 'ఇది', 'పలాన' అని చెప్పుకొంటాం. కేవలం నేను తండ్రి, భర్త, స్నేహితుడు, మొదలైన పాత్రల సంయోగం మాత్రమే కాదు. అంతకంటె ఎక్కువ. నాకు కొన్ని ఆశంసలు, ఆకాంక్షలు, లక్ష్యాలు ఉంటాయి. నన్ను నేను వాటి పరంగా నిర్వచించుకొంటాను. జీవనం కోసం ఏదో ఒకటి చేస్తూ ఉంటాను. అదే జీవితం కాదు. అదే నేను కాదు.

''నేను పట్టుదలతో పనిచేస్తే నేను ''ఏదైనా'' కాగలను. కాని ''అన్నీ'' నేనే కాలేను. ఈ ''కాగలిగే శక్తే'' నాలోని సహజమైన ''నేను''. మామూలు అలవాట్లలో పడి, గాడి జీవితంలో పడి, 'ఏది బడితే అది కాగల శక్తిని', విస్మరిస్తాము. 'నీవు నీవు కా'. నీవు నీవుగా బ్రతుకు'. నీవు నీవుగా ప్రేమించు, అనుభవించు. ఇలా జీవించడంలోనే నీ 'అసలు తనం' ఉంది. అదే 'నీవు'. అదే 'నేను' ''.

''ఇదే జీవితాన్ని, ఇదే పరిస్థితులతో జీవించే అవకాశం లభిస్తే, అవునంటారా? కాదంటారా?'' అని అడిగాను.

''నిరభ్యంతరంగా. అయితే అంత మాత్రం చేత నా జీవితంలో ఏమీ ఒడుదుడుకులు జరగలేదని కాదు. అయినా దాని అసంపూర్ణతల తోనే నా జీవితాన్ని తిరిగి నేను జీవిస్తాను. నేను కావాలనుకొన్నది అయ్యాను. ఇవాన్ ఇల్యిచ్ ( టాల్స్టాయ్ పాత్ర) మరణశయ్య మీద చెందిన నిర్వేదం నాకేమీలేదు''.

ఇల్యిచ్ ఇలా వాపోతాడు: 'నా జీవితం అంతా ఒక ఆభాస అయితే?' అనే ఒక ఆలోచన అతని మదిలో మెదిలింది. తను అనుకొన్న విధంగా తాను జీవించలేక పోయాడు. తాను వద్దనుకొన్న కొన్ని పనులను తా చేయకతప్పు లేదు. చేయాలనుకొన్నవి చేయలేకపోయాడు. తన వృత్తి పరమైన విధులు, తన కుటుంబం, తన జీవిత క్రమం, తన సామాజిక, ఆర్థిక అభిరుచులన్నీ ఆభాసలై ఉండవచ్చు. జీవితంలో తాను చేసిందంతా ఒక్కమాటుగా అబద్ధంగా కనిపించింది. ఇంతకుముందు తాను తన జీవితాన్ని ఎప్పుడూ ఎలా సమర్థించుకొన్నాడో, ఇప్పుడూ అలాగే సమర్థించుకొన్నాడు. కాని అకస్మాత్తుగా తాను సమర్థించే విషయాలలోని బలహీనత అనుభవంలోకి వచ్చింది. సమర్థించుకోవలసింది ఏమీలేదు.

''నేను చెప్పాలనుకొంది చెప్పాననుకొంటాను. 'నేను'ను గురించి నేను ఏమి అనుకొంటున్నది వ్యక్తం చేశాననుకొంటాను'', అని ఆయన ముగించాడు.

---

**'మిసిమి'** వ్యవస్థాపక సంపాదకులు కీర్తి శేషులు శ్రీ ఆలపాటి రవీంద్రనాథ్‌గారి 79వ జయంతి, నవంబరు 4 సందర్భంగా

- సంపాదకుడు

# జీవిత ఆటుపోట్లనుండి సాహిత్యసృజన

## (1929వ సం॥ నోబెల్ సాహితీ పురస్కారోపన్యాసము)

మూలం : థామస్ మాన్ అనువాదం : బి.వి. రామిరెడ్డి

ఇప్పుడు మీకు ధన్యవాదాలు చెప్పుకునే అవకాశం నాకు లంభించింది. ఈ అవకాశం కోసం నేనెంత ఎదురు చూశానో చెప్పనవసరం లేదు. ఈ క్షణాల్లో నా మాటలు నా భావాలను వ్యక్తీకరించలేవు. ఇది ఉన్యాసకులు కానివారికి తరచూగా కలిగే అనుభవమే.

రచయితలందరూ ఉపన్యాసకులుకారు. రచయితా, ఉపన్యాసకుడూ వారి కృషిలోను, సాఫల్యతలోను ఎదురెదురుగా నిలుస్తారు. రచయితకు తన సాహితీ దృక్పథం నుండి చూసినప్పుడు, అప్పటికప్పుడు కల్పించి, కట్టుబడకుండా తప్పించుకునే స్వభావం కలిగిన ఉపన్యాసకుడంటే పడదు. ఉపన్యాసకుడు తన మాటల మధ్య శూన్యాన్ని తన వ్యక్తిత్వంతో నింపుతాడు. అయితే రచయిత యొక్క పరిస్థితి సమస్యాత్మకమైనది. తాత్కాలికమైన సమస్యలు ముందుగానే రచయిత యొక్క ఉపన్యాసాన్ని నియంత్రిస్తా యి. స్వీడిష్ అకాడెమీ గౌరవనీయ సభ్యులైన వారు నన్ను అలాంటి పరిస్థితుల్లో ఉంచడంవల్ల అద్భుతమైన తబ్బిబ్బుల్లో ఉన్నాను. మీరు ఇంత అత్యున్నత పురస్కారాన్ని నాకు ప్రదానం చేస్తారని అనుకోలేదు. నాగ్రంథం ఒక పురాణం; నాటక పురాణం కాదు, కళలోను, జీవితంలోను స్థిరమైన లయబద్ధతను సాధించేందుకు నేను చేస్తున్న సాహితీసృజనకు ప్రశాంతతకావాలి. ఉత్తరాది నుండి నా సృజనాత్మక లయ బద్ధతలోనికి ప్రవేశించిన వెలుగు రేఖలు నా రచనలోని శక్తులకు పరిమితిని విధించాయి. స్వీడిష్ అకాడెమి తన నిర్ణయాన్ని వెలువరించినప్పటి నుండి నేను గొప్ప పండుగ మత్తులో తబ్బిబ్బయ్యాను. ఆ ప్రభావాన్ని వర్ణించాడానికి నేను గొథె ప్రేమ గీతాన్ని ఉటంకిస్తాను. అందులో క్యూపిడ్ ( మన్మధుడు ) తో కవి అన్నమాట మనసులో మెదుల్తోంది. ఆవిధంగా నోబెల్ పురస్కారం నాలో కలిగించిన నాటకీయమైన తబ్బిబ్బు క్రమశిక్షణతో కూడిన జీవితం మీద ఎలాంటి ప్రభావాన్ని కలుగ జేస్తుందో నామీద కూడ అలాంటి ప్రభావాన్నే కలుగ జేసింది.

ఇలాంటి గొప్ప పురస్కారాన్ని అంగీకరించేప్పుడు ఏకళాకారుడైనా సందేహాలకు లోనవుతాడు. శుభ్రమైన, ఆత్మ పరీక్షచేసుకునే కళాకారుడు ఇలాంటి సమయంలో సందేహ పడకుండా ఉండగలడా? ఇలాంటి సందేహస్థితిలో మానవాతీతమైన దృక్కోణం మాత్రమే సహాయపడుతుంది. అలాంటప్పుడు వ్యక్తిని విస్మరించడం ఒక్కటే సరైన మార్గం. గొథె గర్వంగా చెప్పాడు - ''ధూర్తులు మాత్రమే నమ్రతగా ఉండగలరు'' అని! ఆ మాటను నంగిమనుషులు, పతనమైన వారి నుండి తనను తాను దూరంగా ఉంచుకున్న వ్యక్తిమాత్రమే అనగలడు. అయితే అదే అంతిమ సత్యంకాదు. నమ్రతలో జ్ఞానమూ, తెలివీ ఉన్నాయి. నాకు మీరు ప్రదానం చేసిన ఈ పురస్కారంలో గర్వమూ, దురహంకారమూ ఉన్నాయనుకునే వాడు మూర్ఖుడు. అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన ఈ పురస్కారాన్ని నాకు, నా దేశానికి, నాదేశ ప్రజలకు ఇవ్వబడిందని భావిస్తున్నాను.

---

బి.వి. రామిరెడ్డి, పర్వతనేని బ్రహ్మయ్య సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్నారు, విజయవాడ

చాలా సంవత్సరాల తరువాత ఈ స్టాక్ హోమ్ అంతర్జాతీయ పురస్కారం జర్మన్ మేధస్సుకు, ప్రత్యేకంగా జర్మన్ వచనానికి లభించింది. గాయపడ్డ, అపార్థం చేసుకోబడిన నాదేశం మీద చూపించే సానుభూతిని భరించడం కష్టం.

ఈ సానుభూతి యొక్క అర్థాన్ని నేను వివరించగలను. మేధా పరమైన, కళాత్మకమైన జర్మన్ ప్రగతి సాధన గత పదిహేను సంవత్సరాలుగా వాటిని సాధించుకునే పరిస్థితులు భౌతికంగా, ఆధ్యాత్మికంగా అనుకూలంగా లేవు. సుఖవంతమైన రక్షణ ఉంటేనేగాని ఏకార్యమైనా ఎదిగడానికీ, పరిపక్వత చెందడానికీ అవకాశం ఉంటుంది. అయితే కళ, మేధస్సు మామూలుగా సమస్యాత్మక పరిస్థితుల్లోనే బ్రతుకుతాయి. పతనాల్లోనే; దయనీయత, అశాంతి, బాధల్లోనే జర్మనీ మేధస్సు పాశ్చాత్య యూరోపియన్ గంభీరతను నిలుపుకుంది. యూరోపియన్లకు విషయి (form) అనేది అభిమానానికి సంబంధించినది. నేను కాథలిక్కునుకాను, ప్రొటెస్టెంటును. అయితే నా అభిమాన సాధువు సెయింట్ సెబాస్టియన్. ఆ సాధువు కత్తులతోను, ఈటెలతోను అన్ని వేపుల నుండీ పొడుస్తూ ఉంటే, అంత బాధలోనూ నవ్వగలిగాడు. బాధే దయ. అదే నిజమైన వీరత్వం అని నిరూపించాడు. నా జర్మనీ మేధస్సు యొక్క వీరత్వాన్ని తెలియజెప్పేందుకే నేనీ విషయాన్ని ధైర్యంగా ఉదాహరిస్తున్నాను. ఈ జర్మన్ మేధస్సుకు చెందిన వీరత్వానికే, జర్మన్ సాహిత్యానికే ఈ పురస్కారాన్ని మీరు ప్రదానం చేశారు. తన కవిత్వం ద్వారా జర్మనీ బాధలోని దయను వ్యక్తపరిచింది. రాజకీయంగా విషాదపు అనిశ్చితికి లొంగకుండా జర్మన్ తన గౌరవాన్ని నిలుపుకుంది, తన ఐక్యతను కాపాడుకుంది. బాధలోంచి సౌందర్యాన్ని సృజించడం ద్వారా ప్రాచ్యమైన బాధను పాశ్చాత్యమైన రీతిలో మేళవించి తన ఆధ్యాత్మికతను, ఐక్యతను చాటుకున్నది.

ముగింపులో నా వ్యక్తిగత విషయాలను మాట్లాడతాను. స్కాండినేవియన్ ప్రాంతానికి చెందిన లూబెక్ పుత్రుణ్ణి నేను. చాలా పోలికలతో ఉత్తరాది జీవన విధానానికీ సాహితీ సానుభూతికీ, అభిమానానికీ ముడిపడి ఉన్నాను. నాకీ పురస్కార విషయాన్ని తెలియజేసేందుకు వచ్చిన ప్రతినిధులకు ఈ విషయాన్నే తెలియజేశాను. నేను యువకుడిగా ఉన్నప్పుడు 'Tonio Kroger' అనే కథ వ్రాశాను. అది ఇప్పటికీ యువకుల్ని ఆకర్షిస్తోంది. ఒకే వ్యక్తిలో ఉత్తర దక్షిణాల కలయికను గురించి చిత్రించిన కథ అది. అది సమస్యాత్మకమూ, సృజన శీలమూను. ఆ కథలోని దక్షిణాది భావాత్మక, మానసిక సాహసంతో కూడిన కళాత్మకత. ఉత్తరాది హృదయానికి, బూర్జువా గృహానికి, లోతైన భావతీవ్రతకు, గాఢమైన మానవతకు ప్రతీక. ఇప్పుడు ఈ ఉత్తరాది హృదయ గృహం ఈ పురస్కార ప్రదానం ద్వారా నన్ను ఆహ్వానిస్తోంది; ఆలింగనం చేసుకుంటోంది. నా జీవితంలో ఇది చాలా అందమైన, అర్థవంతమైన రోజు. మనం ఈ శుభ సమయంలో కృతజ్ఞతతో కలుసుకొన్నాము. ప్రపంచమంతటికీ ఎంతో ఉపయోగకరంగా ఉన్న మీ ఫౌండేషన్‌కు ధన్యవాదాలు. స్వీడిష్ ఆనవాయితీ ప్రకారం నోబెల్ ఫౌండేషన్‌కు నేను తెలిపే ధన్యవాదాలలో నాతో పాలుపంచుకోండి.

ఈ అంగీకారానికి ముందు ప్రొఫెసర్ జె.యి. జాన్సన్ ఈ విధంగా అన్నారు: ''ఎలక్ట్రానులు, ఆటంల ఉదాహరణలు లేకుండా థామస్ మాన్ మనకు సంబంధించిన విషయాలను తెలియజేశారు. అంతరాత్మ వెలుగులో మనం తెలుసుకునే విధంగా ఆయన మానవ స్వభావాన్ని పరిశోధించారు. ఆ విధంగా ఆయన పరిశోధించిన విషయం శతాబ్దాల ప్రాచీనమైనది. అయితే థామస్ మాన్ ఆ

పరిశోధన మన కాలానికి చెందిన అనేకానేక సమస్యలను మనకు విశదీకరించింది. ఆల్ఫ్రెడ్ నోబెల్‌లాగ ఆయన అందరూ ఒప్పుకునే మనుషుల మధ్య అగంతకునిలా భావించుకోరనుకుంటాను. అన్ని సంస్కృతుల మధ్య ఉన్న సంబంధ బాంధవ్యాలను తెలుసుకునే మానవ ప్రయత్నం అన్ని సంస్కృతులకు మూలభూతమైనది. అందుచేత ఆయన మన మధ్య అగంతకుడిగా భావించుకోరని నేను భావిస్తున్నాను.

## ఆత్మకథ

నేను లూబెక్ పట్టణంలో జూన్ 6, 1875న జన్మించాను. జాన్ హెన్రిక్ మాన్ మా నాన్నగారు. మా అమ్మ పేరు జూలియా డా సిల్వా బ్రన్స్. నేను వారికి రెండో కుమారుణ్ణి. మా నాన్నగారు వ్యాపారస్తుడు. ఫ్రీసిటీ సెనేటర్. మా నాన్నగారి తాతముత్తాతలు లూబెక్ పౌరులు. మా అమ్మ రియో డి జనేరియోలో జన్మించింది. ఆమె ఒక జర్మన్ ప్లాన్‌టేషన్ యజమాని కుమార్తె. ఏడేళ్ళ వయసులో జర్మనీకి తీసుకు రాబడింది.

నేను మా నాన్నగారి భూమికి వారసుణ్ణయ్యాను. నా బాల్యంలోనే దాని శతజయంత్యుత్సవాలు జరిగాయి. నేను లూబెక్‌లోని కథరినియం సైన్సు విభాగానికి హాజరయ్యాను. నాకు స్కూలుకు వెళ్ళడం అంటే ఇష్టం ఉండేదికాదు. బాహ్యమైన కట్టుబాట్లంటే నాకిష్టం ఉండేది కాదు. తరువాతి జీవితంలో నా లోపాలను చాలా శ్రమపడి సవరించుకున్నాను. నేను సాధించుకున్న విద్య అంతా స్వేచ్ఛగా, స్వంత పద్ధతుల్లో సాధించున్నదే. విద్యాలయాల బోధన వల్ల ప్రాథమిక విషయాల జ్ఞానంతప్ప నాలో విద్యను గురించిన తపనను కలిగించలేదు.

నేను పదిహేనేళ్ళ వయసులో ఉన్నప్పుడు మా నాన్నగారు చనిపోయారు. భూసంపద అంతా కరిగి పోయింది. కొద్ది కాలం తరువాత మా అమ్మ చిన్న పిల్లలతో కలిసి జర్మనీ దక్షిణ ప్రాంతంలోని మ్యూనిచ్ పట్టణంలో స్థిరపడడానికి వెళ్ళిపోయింది.

స్కూలు చదువు ముగిశాక మా అమ్మ దగ్గరికి వెళ్ళి మ్యూనిచ్‌లోని ఒక భీమా సంస్థలో గుమస్తాగా చేరాను. ఆ సంస్థ డైరెక్టరు మా నాన్నగారి మిత్రుడు. జర్నలిస్టును కావాలనే ప్రయత్నంలో యూనివర్శిటీలోను, పాలిటెక్నిక్‌లోను చరిత్ర, ఆర్థిక శాస్త్రం, కళాచరిత్ర, సాహిత్యం మీద ఉపన్యాసాలకు హాజరయ్యాను. మధ్యలో ఓ సంవత్సరం ఇటలీలో నా కంటే నాలుగేళ్ళు పెద్ద వాడైన నా సోదరుడు హెన్రిక్‌తో గడిపాను. ఈ సమయం (1898) లోనే నాకథల సంకలనం 'Little Herr Friedemann' అచ్చయింది. రోమ్‌లో నా నవల 'Buddenbrooks' రచన ప్రారంభించాను. దాన్ని 1910లో పూర్తిచేశాను. ఈ నవల నా జర్మనీ దేశీయుల ఆదరాభిమానాలకు పాత్రమయింది. ప్రస్తుతం ఈ నవల ప్రతులు ఒక మిలియన్ దాకా సర్క్యులేషన్‌లో ఉన్నాయి.

1930లో 'Tristan' అనే కథా సంకలనాన్ని వెలువరించాను. దాని తరువాత 'Tonio Kroger', 1906లో 'Fiorenza' అనే నాటకాన్ని రచించాను. ఇవి నాకు మంచిపేరు తెచ్చాయి.

1905లో మ్యూనిచ్ విశ్వవిద్యాలయ గణిత శాస్త్ర విభాగాధ్యక్షుడైన Prof. Alfred Pringsheim

కుమార్తెను వివాహమాడాను. ఆమె తల్లి వేపు తాత గారైన ఎర్నెస్ట్ అండ్ హెడ్విగ్ డామ్ గొప్ప బెర్లిన్ జర్నలిస్టు. ఆయన, ఆయన భార్య జర్మనీ స్త్రీ జనోద్ధరణ ఉద్యమానికి నాయకత్వం వహించారు. మాకు ఆరుగురు సంతానం - ముగ్గురు బాలికలు, ముగ్గురు బాలురు. నా పెద్ద కుమార్తె నటి. నా పెద్ద కుమారుడు రచయిత.

నాకు మంచి పేరు తెచ్చిన నవల 'Royal Highness'. దీనిని 1909లో రచించాను. ఇది ఒక కోర్టు కథ. ఇది ఉన్నత వర్గానికి చెందిన వారి మనస్తత్వానికి ప్రతీక. వారి జీవితానికి సంబంధించిన నీతి, రాజీ విధానం, జీవితం, వారి జీవితాల్లోని విషాదం, వారి అవసరాలు మొదలైన వాటిని విశ్లేషిస్తుంది. 1922లో 'Confessions of Felix Krull, Confidence Man' అనే నవల వ్రాశాను. ఇది పేరడీ రచన. ఇందులో స్వీయశైలి, ఆత్మకథా విధానం, ఉన్నత వర్గాలవారి పశ్చాత్తాపం మొదలైన వాటిని హాస్యాత్మకంగా వర్ణించాను. దీనిని కొందరు నా గొప్ప రచనగా భావిస్తుంటారు. బహుశా ఇది నా రచనల్లో ఎక్కువ వ్యక్తిగతమైనది. ఇది ప్రేమించేదీ, నాశనం చేసేది అయిన సంప్రదాయాన్ని గురించిన నా నమ్మకాలను వివరిస్తుంది.

నా నవలిక 'Death in Venice' 1913లో ప్రచురించడింది. దీని చివరి అధ్యాయాలు రచించే రోజుల్లోనే 'The Magic Mountain'కు సంబంధించిన ఊహ నాలో కలిగింది. అయితే ఈ రచనా కార్యక్రమానికి మొదటి ప్రపంచయుద్ధం అంతరాయం కలిగించింది.

యుద్ధం ప్రారంభం బాహ్యంగా నా మీద ఏ వొత్తిళ్ళూ తీసుకురాకపోయినప్పటికీ దాని కొనసాగింపు నాలోని కళాత్మక కార్యక్రమాలను పూర్తిగా ఆపివేసింది. అది నాలోని ప్రధానమైన నమ్మకాలను- మానవతకు మేధస్సుకు సంబంధించిన ఆత్మ వివేచనను మదింపు చేసింది. దీని ఫలితమే 1918లో రచింపబడ్డ 'Reflections of an Unpolitical Man'. ఇందులో ప్రధానంగా జర్మన్‌గా నా వ్యక్తిగత, రాజకీయ సమస్యలను తార్కికంగా జీవితాంతమూ జరిగిన మార్పుల్ని చర్చిస్తుంది. 1922లో నేను రచించిన వ్యాస సంకలనం 'Question and Answer', 1923లో వ్రాసిన 'Efforts',1930లో వ్రాసిన 'Order of the Day' నా సాంఘిక, నైతిక భావాల పరిణామ క్రమాన్ని విశదీకరిస్తాయి.

యుద్ధం తరువాత మళ్ళీ దేశాల మధ్య సద్భావన ప్రారంభమయ్యాక విదేశాలలో ఉపన్యాస పర్యటన గావించాను. ఆ సందర్భంగా హాలెండ్, స్విట్జర్లెండ్, డెన్మార్కుల్లో పర్యటించాను. 1923లో స్పెయిన్ సందర్శించాను. ఆ తరువాత సవంత్సరం కొత్తగా ప్రారంభింపబడ్డ PEN క్లబ్, లండన్ వారి గౌరవ అతిథిగా గౌరవింపబడ్డాను. రెండేళ్ళ తరువాత Cornegie Foundation ఫ్రాన్స్ బ్రాంచివారి ఆహ్వానాన్నందుకున్నాను. 1927లో వార్సా సందర్శించాను.

ఈలోపున 1924 శరదృతువులో 'Bashan and I' అనే జంతు కథ వ్రాశాను. తరువాత రచించిన 'Dr. Zauberberg' బహుళ ప్రజాదరణ పొందింది. వందసార్లు పునర్ముద్రణలు జరిగాయి. ఈ నవలలో నేను చూపిన సమస్యలు మామూలు జనానికి అర్థం కాలేదు. చదువుకున్నవాళ్ళకి మాత్రం అవి బాగా నచ్చాయి. ఆ కాలపు నిరాశా నిస్పృహలు జనాన్ని బాగా ఆకట్టుకున్నాయి. ఆకాలపు ఆర్థిక మాంద్యం, విప్లవ విషయాలతో 1926లో 'Disorder and Sorrow' అనే బూర్జువా నవలికను వ్రాశాను. 1929లో 'Maxio and the Magician'ను రచించాను. ఈ తరహా నవలల్లో ఇదే నా

ఆఖరి రచన. 'Joseph and Seine Bruder' అనే బైబిలుకథ జర్నల్స్‌లో ప్రచురింపడింది. ఇంతలో స్టడీటూర్‌లో 1930 మార్చి, ఏప్రిల్ నెలల్లో ఈజిప్టు, పాలస్తీనాలలో పర్యటించాను.

తొలి రోజుల నుండి నన్ను నా సహచరులు, అధికారిక గౌరవాలు బాగా ప్రోత్సాహపరిచాయి. 1919లో బాన్ విశ్వవిద్యాలయం నన్ను గౌరవ డాక్టరేట్ డిగ్రీతో సత్కరించింది. లూబెక్ సెనేట్ సాంవత్సరీకోత్సవంలో ప్రొఫెసర్‌గా గుర్తించింది. ప్రష్యను అకాడమీ ఆఫ్ ఆర్ట్స్‌కి నామినేట్ చెయ్యబడ్డ తొలి సభ్యులలో నేనూ ఉన్నాను. నా యాభయ్యవ జన్మదినోత్సవం సందర్భంగా స్వీడిష్ అకాడెమి నాకు నోబెల్ సాహితీ పురస్కారాన్ని ప్రదానం చేస్తున్నట్టు ప్రకటించింది. అయితే ఈ పురస్కారాలేవీ నా ఆత్మ విమర్శను మొద్దు పరచలేదు. నా రచనలు నా వ్యక్తిగత జీవితపు జాడలు.

## థామస్ మాన్ జీవితంలోని ప్రధాన ఘట్టాలు

థామస్ మాన్ (1875-1955) నాజీలు అధికారంలోకి వొచ్చి, తనమీద దుష్ప్రచారం ప్రారంభించాక 1933లో స్విట్జర్లండుకు మకాం మార్చాడు. 1936లో స్వదేశం నుండి వెలివేయబడ్డాడు. 1937లో బాన్ విశ్వవిద్యాలయం అతనికి ప్రదానం చేసిన గౌరవ డాక్టరేట్ పట్టాను వెనక్కి తీసుకుంది. దీన్ని మరలా 1946 లో ప్రదానం చేసింది. ఆ సందర్భంగా మాన్ విశ్వవిద్యాలయం వారి కిచ్చిన సమాధానం ప్రసిద్ధమైనది. అప్పటికే అతడు ఫాసిజాన్ని పసిగట్టి హెచ్చరించాడు. నాజీ ఇజం ప్రారంభం నుండి రెండో ప్రపంచయుద్ధ కాలందాకా పాంప్లెట్లతో, ప్రసంగాలతో నాజీయిజాన్ని ఎదుర్కోవాల్సిన అవసరం గురించి హెచ్చరించాడు. 1940లో అమెరికన్ పౌరసత్వాన్ని స్వీకరించాడు. 1941 నుండి 1953 వరకు కాలిఫోర్నియాలోని శాంతామోనికాలో నివసించాడు. యుద్ధం తరువాత తరచుగా యూరోపులో పర్యటించాడు. 1949లో గొథె పురస్కారాన్ని అందుకున్నాడు. చివరిగా యూరోపుకు వచ్చి జ్యూరిచ్‌లో స్థిరపడ్డాడు. 1955లో అక్కడే చనిపోయాడు.

మాన్ తరువాత సంవత్సరాల్లో రచించిన ముఖ్య రచనలు 'The Beloved Returns' (1939) ఇద్దరు వయసు మీద పడ్డ ప్రేమికుల కలయికను వర్ణిస్తుంది. 'Joseph and his Brothers' బైబులు పాత నిబంధనకు చెందిన కథ. ఇందులో పురాణం, మనో విశ్లేషణ అనుసంధింపబడ్డాయి. 1947లో రచించిన Dr. Faustus ఒక కళాకారుడు మేధా సంపత్తి కోసం తనని తాను వినాశనానికి అంకితం చేసుకున్న కథ. 'Suffering of the Masters' వ్యాస సంకలనాన్ని 1935లో రచించాడు. 1955లో అతడు వ్రాసిన స్కిల్లర్ మీది వ్యాసం సుప్రసిద్ధమైనది. 1956లో థామస్ మాన్ సంపూర్ణరచనలు పన్నెండు సంకలనాలుగా బెర్లిన్‌లోను, 1960లో ఫ్రాంక్‌ఫర్టులోను ప్రచురింపబడ్డాయి.

## పురస్కార ప్రదానాహ్వానము

19వ శతాబ్ది సాహిత్యపరంగా సాధించిందేమిటి? అని ఎవరైనా ప్రశ్నిస్తే అది పాతకాలపు పురాణం, నాటకం, లిరిక్ మొదలైన గ్రీసు దేశపు పునాదులు కలిగిన సాహితీ ప్రక్రియలకు తోడుగా, వాస్తవిక వాద నవలను సృష్టించింది అని చెప్పవచ్చు. అది తన సమకాలీన సామాజిక పరిస్థితుల నేపద్యంతో పరస్పరాధారమైన వ్యక్తిగతము, సామాజికతలతో మనిషి అంతరాంతరాల్లో దాగివున్న రహస్యానుభవాలను సమగ్రంగా, వాస్తవికంగా చిత్రించగలిగింది.

వాస్తవిక వాద నవల ఆధునిక వచన పురాణం. అది శాస్త్రీయ, చారిత్రక విషయాలతో ప్రభావితం అయింది. దీనిని ఆంగ్ల, ఫ్రెంచి, రష్యన్ రచయితలు సృజించారు. డికెన్సు, థాకరే, బాల్జాక్, ఫ్లాబర్ట్, గొగోల్, టాల్‌స్టాయ్ మొదలైన పేర్లతో అది అనుసంధింపబడి వుంది. అయితే, వీరితోబాటు ఈ నవలకు జర్మనీ నుండి ప్రతినిధులెవరూ లేక పోయారు. 19వ శతాబ్దాంతంలో ఒక 27 సంవత్సరాల వయసుగల యువ రచయిత, ఒక వ్యాపారి కుమారుడు, లూబెక్ పట్టణవాసి, 1901లో 'Buddenbrooks' అనే నవలను ప్రచురించి ఆ లోటును పూరించాడు. ఈ నవలిక జర్మన్ భాషలో అనితరమైన, ఉదాత్తశైలిలో వ్రాయబడి, యూరోపియన్ సాహితీ సభలో తన సమున్నత స్థానాన్ని అలంకరించింది.

'Buddenbrooks' ఒక బూర్జువా నవల. అది తన సమకాలీన బూర్జువా యుగాన్ని చిత్రించింది. అది చిత్రించిన సమాజం ఆశ్చర్యాన్ని కలిగించేంత గొప్పదీ కాదు, చౌకబారుదీ కాదు. ఈ స్థితి తెలివైన, ఆలోచనాభరితమైన సంక్లిష్ట విశ్లేషణ సృజన శక్తి; పురాణ కథనంలోని సంతృప్తిని, ప్రశాంతత, పరిపక్వతలను ప్రతిబింబిస్తుంది. మనది బూర్జువా సంస్కృతి. మనం ఈ చారిత్రిక సరిహద్దులను, కాలపరిణామాలను, తరాల మార్పులను, నెమ్మదిగా జరిగే శక్తివంతమైన, స్వయం పూరితమైన, ఆత్మ పరిశీలనా రూపొత్మైనపాత్రల నుండి పరిపక్వమైన, బలహీనమైన స్పందనలతో కూడిన ప్రతిబింబాల్లాంటి వ్యక్తిత్వ సమూహాలకు మారడం చూస్తాము. రచనాశైలి జీవనాంతర్గత మూలాల్లోకి చొచ్చుకుపోతుంది. అది శక్తివంతమైనదైనప్పటికీ జంతుతుల్యమైనది కాదు. అది సుకుమారమైన విషయాలను స్పృశిస్తుంది. అది విషాదమూ, తీవ్రమూ అయినప్పటికి విషాదపూరితం కాదు. అది ప్రశాంతమూ, గాఢమూ అయిన హాస్యభావ పూరితం. వ్యంగ్య వైభవాత్మకం.

సాంఘిక చిత్రణలోను, వాస్తవికతలోను 'Buddenbrooks'కు జర్మన్ సాహిత్యంలో సాటిరాగల గ్రంథం లేదు. ఈ నవల జర్మన్ మనస్తత్వపు మామూలు లక్షణాలను తన ఆధ్యాత్మిక, సంగీతాత్మక భావాతీతవాదంతో నిరసిస్తుంది. సాహిత్య వాస్తవికతా వాదం మీద తిరుగులేని అధికారం సాధించిన ఈ యువ రచయితలో షోపెన్‌హార్ యొక్క నిరాశావాదం, నీషే సాంస్కృతిక విమర్శ ఇమిడి వున్నాయి. ఈ నవలలోని ప్రధాన పాత్రలు తమ రహస్యాలను సంగీతయుక్తంగా వ్యక్తపరుచుకుంటాయి.

'Buddenbrooks' ప్రధానంగా తాత్త్విక నవల. ఒక కుటుంబ పతనాన్ని, జీవన పరిస్థితుల్ని గంభీరమైన లోచూపుతో ఈ నవలలో చిత్రించబడింది. అంతర్ దృష్టి, ఆత్మ పరిశీలన, మానసిక పరివర్తన, తాత్త్వికగాంభీర్యం, కళాత్మకత మొదలైనవి యువకుడైన థామస్ మాన్‌కు పతన మౌతున్న వినాశకర శక్తులుగా అనిపిస్తాయి. అతని ప్రఖ్యాత కథ 'Tonio Kroger' (1903), మానవ జీవితం మీది అతని ప్రేమను హృదయవిదారకంగా చెబుతుంది. అతడు బూర్జువా ప్రపంచానికి బయట తటస్థంగా నుంచుని ఆ ప్రపంచాన్ని చిత్రించాడు. అందుచేత అతని దృష్టి స్వేచ్ఛా పూరితమైనది.

'Buddenbrooks'లోని గాంభీర్యత మాన్ యౌవనదశలోని బాధాకరమైన అనుభవాలలోంచి వొచ్చింది. వాటి పరిష్కారాల కోసం రచయితగా జీవితాంతమూ అనేక విధాలుగా ప్రయత్నించాడు.

రచయిత తనలో కళాత్మక తాత్త్వికతకు, బూర్జువా తత్త్వానికీ మధ్య ఘర్షణను అనుభవించాడు. అతడీ సమస్యకు ఒక ఉన్నతమైన అతీతమైన స్థితిలో సామ్యతను కుదిర్చేందుకు ప్రయత్నించాడు. అతని చిన్న కథలు 'Tonio Kroger', 'Tristan'లలో జీవితం నుండి వెలివేయబడ్డ కళారాధకులు, జ్ఞానులు, ఆత్మాహుతులు మామూలు ఆరోగ్య కరమైన జీవితాన్ని గడపాలనే ఆకాంక్షను వ్యక్తపరుస్తారు. అది మాన్ యొక్క ద్వంద్వీకృతమైన మామూలు, సంతోషకర స్వభావాల మీది ప్రేమే.

మాన్ 1909లో రచించిన నవల 'Konigliche Hoheit' (Royal Highness). ఇందులోని వాస్తవికత ప్రతీకాత్మక కథగా రూపాంతరం చెందుతుంది. ఇందులో రచయిత కర్మయోగి అయిన మనిషి జీవితంతో కళాకారుడు రాజీ పడడం కనిపిస్తుంది. అతడు ఈ మానవాదర్శాన్ని సూత్రీకరిస్తాడు. ఔన్నత్యం, ప్రేమ అనేవి గొప్ప సంతోషాత్మకాలు. అయితే 'Buddenbrooks'లో లాగ ఈ కథలో సంశ్లేషణ నమ్మించగలిగేది గాను, లోతైన అనుభూతిని కలిగించేదిగాను వుండదు. 1906లో అతడు రచించిన నాటకం 'Fiorenza'లోని నీతి వాది Savonarola, కళావాది Lorenzo di Medici గాని రాజీపడని విరోధులుగా కనిపిస్తారు. 1913లో రచింపబడ్డ 'Der Tod in Venedig' (Death in Venice)లో ఇది విషాదాత్మక ప్రాధాన్యతను సంతరించుకుంది. మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు సంవత్సరాల్లో అతనికి Frederick The Great వ్యక్తిత్వం మీద అభిమానం కలిగింది. ఆ నియంత చారిత్రకంగా ఆ సమస్యలకు విలువైన పరిష్కారాలను సాధించాడనీ, అతనికి తిరుగులేని జ్ఞానం, శక్తి, కార్యదీక్ష, ఎలాంటి భ్రమలకు తావులేని అవగాహన ఉన్నాయని మాన్ భావించాడు. 1915లో అతడు రచించిన వ్యాసం 'Fredrick the Great and the Grand Coalition' లో వాస్తవాన్ని, పరిష్కారాన్ని సూచించే అవకాశాలున్నాయని సూచించాడు. అయితే సమస్యాత్మక రచన అయిన 'Buddenbrooks' ఈ ఆదర్శానికి ప్రతినిధిగా నిలవదు.

మొదటి ప్రపంచయుద్ధమూ, దాని పర్యవసానాలు మాన్‌ను అతని ఏకాగ్రతను, సౌందర్య దృక్పథాన్ని వొదిలేట్టు వొత్తిడి చేశాయి. అతడు తన నవల 'Konigliche Hoheit'లో చెప్పిన సిద్ధాంతం - సౌఖ్యవంతమూ, సులభతరమూ అయిన మార్గం విషయంలో జాగ్రత్తగా ఉండాలనే సలహాను అనుసరించాడు. తన మాతృదేశం ఎదుర్కొంటున్న బాధాకరమైన సమస్యల పరిష్కారానికి అంకితమయ్యాడు. అతని తరువాతి రచనల్లో, ముఖ్యంగా 'The Magic Mountain' నవలలో తను ఏ ఆదర్శాల కోసం జీవితాంతమూ పోరాడాడో వాటికి సంబంధించిన సంఘర్షణ కనిపిస్తుంది.

డా॥ థామస్ మాన్, మీరు జర్మన్ రచయితగా, ఆలోచనాపరుడిగా కళ అనేది ప్రశ్నింపదగినదని నమ్మి, వాస్తవాలతో, భావనతో బాధాసౌందర్యాన్ని సృజించారు. మీరు కవిత్వపు ఔన్నత్యాన్నీ, మేధస్సునీ మానవ ప్రేమతో, సామాన్య జీవితంతో అనుసంధించారు. మా మహారాజుగారి చేతులు మీదుగా స్వీడిష్ అకాడెమి తన శుభాకాంక్షలతో మీకు సమర్పిస్తున్న నోబెల్ సాహితీ పురస్కారాన్ని అందుకోవలసిందిగా అభ్యర్థిస్తున్నాను.

– ఫ్రెడ్రిక్ బుక్

*(సభ్యుడు, నోబెల్ సాహితీ పురస్కార సంఘం)*

# కళాసాహితీ సవ్యసాచిత్వం

- మాకినీడి సూర్యభాస్కర్

ఒక రంగంలో కళాకారులైనవారు తమ అభివ్యక్తిని వేరు కళామాధ్యంలో కూడా సాగించడం సర్వసాధారణం. ఒకే వ్యక్తిలో భిన్న కళలు రాణించడం మనం చూస్తుంటాం. మహోన్నత కళాకారులెందరో అలాంటి వారున్నారు. మంచి ఉదాహరణ డా॥ (శ్రీమతి) భానుమతి రామకృష్ణ - చలనచిత్ర అభినేత్రి అయిన ఆమె మంచి సంగీతజ్ఞురాలు. త్యాగరాయ కీర్తనలను ఆమె గొంతు నుంచే వినాలి. ఎంత గొప్ప నర్తకో అంత గొప్ప రచయిత్రి. అలాగే గాయని ఎస్. జానకి మంచి చిత్రకారిణి కూడా. వీరిలా అనేక కళల్లో తమ అభివ్యక్తిని సాధించిన కళాకారులెందరో ఉన్నారు. ఒకే వ్యక్తిలోనున్న భిన్న కళలు ఒకదాని నొకటి ప్రభావితం చేసుకోడం సహజం. సాధారణంగా ఈ భిన్న కళాభివ్యక్తులూ ఆ వ్యక్తిలో సామరస్యతను సాధించాలి. లేదంటే ఆ కళాకారుని వ్యక్తిత్వం అనిశ్చితమై, కళా సంబంధమైన మనుగడ యింకిపోతుంది. అటువంటివారు భ్రష్ట కళాయోగులవుతారు.

ఒక వ్యక్తిలోని భిన్న కళాభివ్యక్తులు ఏ విధంగా ఒకదాన్నొకటి ప్రభావితం చేసుకుంటాయోనన్న ఆలోచననన్నీ వ్యాస రచనకు పురికొల్పింది. అయితే నాకున్న పరిమితులు నాకున్నాయి. భిన్న కళలను అనుశీలించే సామర్థ్యం పూర్తి స్థాయిలో నాకు లేదు. అందువల్ల నా పరిమితికి లోనై, కేవలం సాహిత్యమూ, చిత్రలేఖనం - ఈ రెండు అభివ్యక్తుల పరిశీలన ద్వారా కళాకారునిలో ఒక కళ మరో కళను ఏ విధంగా ప్రభావితం చేయగలదో పరిశీలించ దలిచాను. ఎందుకంటే, చిత్రకారునిగా, కవిగా, రచయితగా రెండు కళారంగపుటనుభవాలూ నాకున్నాయి.

మనిషి జడ చేతనాల కూడలి. జడం స్థితిబద్ధం, చేతన గతిబద్ధం; జడచేతనాల కలయిక లయబద్ధం. ఈ లయ కొందరిలో నిద్రాణంగా ఉంటుంది; కొందరిలో మేలుకొని ఉంటుంది. మేలుకొని ఉండే లయ 'జీవనలయ'. జీవనలయ ఎక్కువైన జీవితం కళామయం. అటువంటి వ్యక్తి రాసింది కవిత, గీసింది చిత్రం.... అడుగువేస్తే నాట్యం, గొంతు విప్పితే పాట!

ఒక చేతితో కళాఖండాలు చిత్రిస్తూ మరో చేతితో కవితల్లల్లడం సవ్యసాచిలాంటి లక్షణాలున్నవారికే చెల్లుతుంది. చిత్రకారుడు కవి అయితే లేదా కవి చిత్రకారుడైతే అద్భుత కళావినిమయం జరుగుతుంది. అందుకు ప్రత్యక్షసాక్షి రవీంద్ర కవీంద్రుడే. తన చిత్రాలను 'భావం లేని రూపాలు'గా ఆయనే వర్ణించుకున్నారు. టాగూర్ చిత్రణ శాస్త్రీయం కాదు. ఆయన చిత్రకళను ఒక శాస్త్రంగా అభ్యసించలేదు. అలాగే రవీంద్రుని సాహిత్యం కూడా శాస్త్రీయం కాదు. ఆయన భాష వాడుక వంగభాషే కాని, శాస్త్రీయమైన గ్రాంథిక వంగభాష కాదు (ఆయన కాలం దృష్ట్యా ఆలోచిస్తే). మౌలికంగా ఆయన కవి. ఆ తర్వాతే చిత్రకారుడు. ''ఆయన గీతాల్లో రంగులుంటవి.... చిత్రాల్లో రాగాలుంటవి'' అని అంటూ సంజీవదేవ్, ''రవీంద్రుని కవిత్వం వలెనే ఆయన చిత్రించిన రూపాల్లో రహస్యాలు లేవు; ఆ రంగుల్లో మర్మాలు లేవు. వాటిని ఆయన చిత్రించే ఘడియల్లో ఎంత ఆనంద తన్మయతతో చిత్రించాడో నేడు వాటిని చూడటంలో అంతకు మించిన ఆనంద తన్మయతే దొరుకుతుంది ప్రేక్షకునికి'' అంటారు.

చైనా, జపాను చిత్రకారులందరు ఇంచుమించు కవులు. వారంతా తమ చిత్రాలకు తమవైన పదచిత్రాలను ఉల్లేఖించుకున్నవారే. మైకేలాంజిలో చిత్రకారుడే కాదు; ఇటాలియన్ భాషలో వందల కొద్దీ సానెట్లు రాసిన మంచి కవి. విలియం బ్లేక్ కూడ అంతే. డాంటే గేబ్రియల్ రోజెట్టి సరేసరి.

---

మాకినీడి సూర్య భాస్కర్, కాకినాడ; ప్రముఖ చిత్రకారుడు, కవి, రచయిత.

మనవారి విషయానికొస్తే మోలారామ్ వంటి రాజపుత్ర చిత్రకారుడు, హల్దార్, జార్జికీట్, లామాగోవింద్, నికోలస్ రోరిక్, హిరోషిగే, అవనీంద్రనాథ్ టాగూర్, రాయ్ చౌధురి, ప్రొ॥ బీరేశ్వరసేన్, శ్రీమతి హార్డీ, దివ్యజ్ఞాన సరోజినీదేవి, అడవి బాపిరాజు, సంజీవదేవ్, మా గోఖలే, మొక్కపాటి కృష్ణమూర్తి - ఇలా ఎందరెందరో మహానుభావులు. అందరినీ పరిశీలించడం కష్టం. అందుకే అటువంటి తెలుగింటి కళాసాహితీ మూర్తులను మాత్రమే నా పరిశీలనకు పరిమితం చేస్తున్నాను. అందునా చిత్రకళతో పాటు సృజనాత్మక రచనలు చేసినవారినే ఎంచుకున్నాను. కళా సమీక్షలు, విమర్శక వ్యాసాలు రాసిన చిత్రకారులెందరో ఉన్నా వారిని ముట్టుకోలేదు.

**శ్రీ అడవి బాపిరాజు:** తెలుగువారిలో ప్రాతఃస్మరణీయుడైన కళా సాహితీమూర్తి అడవి బాపిరాజు. సాహిత్య చిత్రలేఖనాలే కాకుండా సకల కళాస్రష్ట ఆయన. గొప్ప కవి, చిత్రకారుడు, శిల్పి, గాయకుడు, నాట్యకళావేత్త, మీదు మిక్కిలి అమోఘమైన చలనచిత్ర కళాదర్శకుడు. సాహిత్యంలో కూడ ఆయన చేపట్టని ప్రక్రియ లేదు - కవిత్వం, విమర్శ, కథ, నవల - యిలా ఆయన సాహిత్యం ఎంతో వైవిధ్యభరితం. హిమబిందు, అంశుమాలి, గోన గన్నారెడ్డి, అడివి శాంతిశ్రీ వంటి చారిత్రక నవలలకు ఒరవడి దిద్దిన బాపిరాజు, చారిత్రక ప్రసిద్ధి పొందిన పురుషులను చిత్రించడం కాకతాళీయం కాదు. ఆయన చిత్రించిన 'సముద్రగుప్తుడు', 'ఖడ్గ తిక్కన', 'తిరుమల నాయకుని దేవేరి', 'రుద్రమదేవి' వంటి చిత్రాలే యిందుకు సాక్ష్యం. ''శిల్ప, చిత్రకళారూపాల్లో ఎందుకయ్యా వికృతరూపాలు, జుగుప్సాకరమైన మూర్తుల కల్పనలు?'' అని తరచు శిష్యులకు బోధించే ఆయన చిత్రాల్నికానీ, కవితల్నిగానీ ఏ వికృతులు, దొసగులు లేని నిద్దంపు శిల్పాల్లా మలిచారు. శిల్పాలైనా, చిత్రాలైనా అవి అందం చిదిమి పోగులు పోసినట్లుండాలనే వారాయన.

అడవి బాపిరాజు తన రేఖా విన్యాసాలలో కవిత్వాన్ని ఒలికిస్తారు. తన కవిత్వంలో భావ చిత్రణ ద్వారా దృశ్యాన్నీ, రూపాన్నీ మన కళ్ళముందు నిలుపుతారు. 'అమ్మగారీ యిళ్ళు... ధర్మ లోగిళ్ళు' - అతి సహజమైన కళాఖండం. ఒకనాటి సాలంకృతమైన తెలుగు వాకిళ్ళ ముందు మనలను నిలుపుతుంది. చిత్రంలో రంగుల సంపుటీకరణ చిత్ర చిత్రాలైన కవితా భావాలను ఒకేమారు పలికించినట్లుంటుంది. ఇక రేఖా విన్యాసం మృదువైన ఉదాత్త భావనలకు దృశ్య రూపాన్నిస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ చిత్రం బాపిరాజు గారి రంగుటాలోచనలకు ప్రతిరూపం. అలాగే బాపిరాజుగారి ప్రతిగేయంలోను చిత్రలేఖన ముంటుంది. నాట్యకళ తాండవమాడుతుంది. ఆయన రచనా శైలి అటువంటిది. బలమైన ఆయన కలం ఉన్నట్టుండి కుంచెగా మారిపోతుంది. ఆయనగేయాలు ఒకేసారి కళ్ళకు, చెవులకు కూడ పని చెబుతాయి. అవి మనోజ్ఞ వర్ణాంచిత వర్ణ చిత్రాలు. ఉదాహరణకు 'ఒక్కణ్ణే' అనే కవిత -

ఒక్కణ్ణే ఇసుక బయలు
ఒక్కణ్ణే కడలి, చదలు
దవుదవ్వుల జరిగిపోవు
దశదిశాంత రాళమందు ....

హోరుమనే వారి రాశి
మారుమోగె నా పాటలు
ఎగిరిపడే తరగలలో
నురుగులలో పరుగులలో ....

ఒక లేండ్‌స్కేప్‌లోని దూరాభాస దృశ్యం కనబడుతుంది. అలాగే

''ఉప్పొంగి పోయింది గోదావరి తాను
తెప్పున్న ఎగసింది గోదావరి
అడవి చెట్లన్నీని జడలోన తురిమింది
ఊళ్ళు దండలు గుచ్చి మెడలోన దాల్చింది....'' అంటూ

వరద వచ్చిన నాటి విలయతాండవాన్ని అక్షరాలలో బొమ్మ కట్టి చూపుతారు. ఒక బొమ్మ వేసినా, పాట పాడినా, కథ చెప్పినా దాన్ని సర్వసంపూర్ణమైన కళాఖండంగా తీర్చి దిద్దడం బాపిరాజు వైశిష్ట్యం. ఆయన నవలలు పెద్ద కాన్వాస్ మీద గీసిన చిత్రాలయితే, కథలు మినియేచర్ కళాఖండాలని చెప్పవచ్చు. వీరి వర్ణనకు 'వీణ' కథ మచ్చుతునక. బహుముఖీనమైన కళాకారుడు కాబట్టే వీరి రచనలలో సౌందర్య మూర్తులు, కళాపిపాసులు ప్రధానపాత్రలు. అలాగే వర్ణనల్లో ఆయనలోని ఇతర కళాకారులు ఉపమానింపబడతారు. '' ఆ ముక్కు సమంగా సన్నంగా రాగంలోని సంగతిలా ఉంది'' (మనుబాలుడు) - గాయక దృష్టి. ''అందమైన వంకలు సేకరించుకొన్న ఆమె పెదవులు తడి రబ్బరుతో చెరిపిన రేఖలులా మరకలు పడినవి'' - చిత్రకారుని దృష్టి. లలిత కళలను వస్తువులుగా తీసుకుని నిర్మించిన ఆయన రచనల్లో తదనుగుణ్యమైన ఉపమానాలు, వర్ణనలు, భాష కనబడతాయి.

**శ్రీ సూర్యదేవర సంజీవదేవ్:** తలచుకోగానే కళావిమర్శకునిగా గుర్తుకొచ్చే డా॥ సూర్యదేవర సంజీవదేవ్ మంచి చిత్రకారుడు. సృజనాత్మక రచయిత కూడా. రెంటినీ ఎంతో నైపుణ్యంతో, సమర్థవంతంగా, సజీవంగా పోషించిన కళాకారుడు. ఈయన ప్రకృతి చిత్రాలను లేలేత రంగులలో అధి కంగా చిత్రించారు. చిత్రాలలోని లేతరంగులకు, నునులేత వర్ణ లేపనానికీ సరిపోయే విధంగా రచనలో ఈయన వాడే తేలిక పదాలు తేనెలొలుకుతూ సూక్ష్మమైన సున్నిత భావాలను వ్యక్తీకరిస్తాయి. ఈయన సౌందర్య పిపాసి, సౌందర్యాన్వేషి. కనుకనే చిత్రాల్లోను, రచనల్లోను ప్రకృతినే అధికంగా ప్రతిబింబించారు. హిమాలయ సంచారం బాగా చేసినవారు కావడం వల్ల ఈయన చిత్రాల్లో ఏదో విధంగా ఆ హిమాలయ ఛాయలు కనబడతాయి. రచనలో సంజీవదేవ్‌ది వారిదైన సహజశైలి. ఈయన కుంచెతో ఎలా చిత్రాలు గీస్తారో, శబ్దాలతో, వాక్యాలతో అక్షర చిత్రాలను అలానే సృష్టిస్తారు.

ఇతరుల పుస్తకాలకు రాసే పీఠికలు, ముందు మాటల్లో విషయాన్నీ, రచయితనూ చక్కగా విశ్లేషించి రచయిత ధ్యేయాన్నీ, హృదయాన్నీ వెలికి తీసి చూపుతారు సంజీవదేవ్. సాధారణంగా రచయితను ప్రధానం చేయకుండా రచయిత వ్రాసిన విషయాన్నీ, తదనుగుణ్యమైన అంశాలను వెలికి తీసి రచయిత యొక్క రచనా వ్యక్తిత్వాన్ని చూపుతారు. వ్యక్తులను గురించి రాస్తే, వారిలోని విశిష్టతను వెలికి తీస్తారు. అలాగే ఈయన చిత్రాలలో - ప్రకృతిలో కంటికి కనిపించే బాహ్యరూపాల కంటె మనసుకు గోచరించిన ఆయా దృశ్యాల రసరూపాలు, ఆంతరంగిక రూపాలే అధికం. ఎంతో వైవిధ్యం గల వ్యక్తులమీద, వ్యక్తిత్వాల మీద, కళల మీద, కళారంగాలమీద సంజీవదేవ్ చక్కని అభిప్రాయాలు వెలువరించడానికి కారణం ఆయనకు ఆయా వ్యక్తులు, వ్యక్తిత్వాలతోనూ, కళలు, కళారంగాలతోను ప్రత్యక్షమైన, పరోక్షమైన పరిచయాలు ఉండడమే. ఆంధ్రాంగ్లాలలో ఈయన రాసిన కవిత్వంలోని సున్నితమైన భావాలు, భాష ఈయన చిత్రాల్లోని నిసర్గ సౌందర్యాన్నిచ్చే జలవర్ణాల సమ్మేళనంతో పోల్చదగినవి. వీరు చిత్రించినది ఎక్కువగా ప్రకృతి చిత్రాలనే. ఆ ప్రాకృతిక వర్ణనలు, వ్యత్యాసాలతోనే మానవ నైజంలోని క్లిష్టమైన అంశాలను సైతం ఆవిష్కరించగలరీయన. ఒక ఉదాహరణ —

"No doubt the metal is stronger than the petal
But at times the petal is far stronger than the metal
Both petal and metal make the man vital
Each bereft of the other is frail and futile".

జీవితాన్ని విమర్శనాత్మకంగా, విచక్షణా జ్ఞానంతో అనుభవించి, జీవించడాన్నే కళగా మలచుకొన్న మహా మానవతావాది సంజీవదేవ్. ఒక కళావేత్త, ఒక సౌందర్య పిపాసి, ఒక సాహిత్య పిపాసి మాత్రమే కాక ఒక మేధావి, ఒక ఆధునిక తాత్త్వికుడు సంజీవదేవ్.

**శ్రీ అంట్యాకుల పైడిరాజు:** లలితకళలన్నింటిలోనూ వీరికి ప్రవేశముంది. చిత్రకళలో ఆయనది జానపద ఆలంకారికశైలి. అదే శైలి వారి కవితలు, కథల్లో కనబడడం విశేషం. పల్లెటూరి జానపదుల అమాయకత్వం, నిజాయితీ కళ్ళకు కట్టినట్లు, హృదయానికి హత్తుకున్నట్లు ఉంటాయి వారి కథల్లోని పాత్రలు. రంగులతో మూర్తి చిత్రణ చేయాల్సిన చిత్రకారుడు పదాలతో చేస్తే ఎలా ఉంటుందో 'నా మూర్తి చిత్రం' కవితలో చూపారాయన.

''నాదొక తొమ్మిది ద్వారాల నగరం
నా ముఖమే ఒక రంగస్థలం
నా కంఠం ఒక నాదస్వరం
నా చూపే ఒక చిత్రపటం
నా మాటే ఒక కవిత్వం
నా శరీరం ఒక కళా కేంద్రం

నా హృదయం ఒక ఆవేశం
నా గీటే ఒక మౌలికం
నా రంగే ఒక లౌకికం
నా కథే ఒక సందేశం
నిలచి ఉన్నానొక గంట స్తంభంలా....''

దీన్ని అక్షరాలా 'అక్షర మూర్తి చిత్రణ' అనవచ్చు. అలాగే 'వాటాలు' కథలో ఒక సన్నివేశాన్ని వర్ణించిన తీరు - ''అనంతగిరి బస్సులోంచి యిరుప్రక్కలా సుందరంగా కనిపిస్తున్నాయి దృశ్యాలు - రోడ్డుకిరుప్రక్కలా ఎర్రని పూలతో నిండిన పచ్చని తొగరిచెట్లు నీలి ఆకాశంలో లీనమైపోతున్న ఎత్తైన శిఖరాలు, చొచ్చుకుపోతున్న ఆలోయలూ, అక్కడక్కడ ప్రకృతి ఒడిలో దాక్కుని వున్న గిరిజనుల పూరి గుడిసెలు, ఆ గుడిసెల చుట్టూ పండిస్తూ వున్న పచ్చని పైరు పంటలూ, కోతలు కోస్తూ, మోతలు మోస్తున్న అంగనల బారు ('కృషీవలులు' చిత్రంలో యిదే దృశ్యం భారతి, జులై 52) - నింగి ఇంద్రధనుస్సులా ఉంది. తేలికైన నీలిరంగు కొండలలోంచి నారింజపండు రంగులో బస్సు వస్తుంటే, చిత్రకారుని కుంచె కదల్చాలనిపించక తప్పదు...'' - ఈ వర్ణన రంగుల ప్రమేయంతో ఒక పెయింటింగును చూస్తున్న అనుభూతినిస్తోంది. అంతే కాకుండ, చిత్రకళలోని తన నైపుణ్యాన్ని కవితారచనలో ప్రయోగించారు పైడిరాజు. ఆయనే చెప్పుకున్నారు ''చిత్రరచనా విధానాలు నా కవితలకు జోడించి ఆ భావాలలో వ్రాయాలన్న సంకల్పం నాది. అయితే అది అంత తేలికైన పని కాదు. ఇది అవసరమైనపనే. ఇదివరకెన్నడూ ఎవ్వరూ చేయని పని...'' అంటారాయన. పైడిరాజుగారి వర్ణమయమైన వర్ణనాక్రమం 'రూపాలు- రంగులు' కవిత నుండి -

''నారింజ పండులా ఉదయించాడు ఉదయభానుడు
నీలి సముద్రపు తరంగాలలోంచి మెల్లమెల్లగ

చదును భూమిపై ప్రసరించాడు పసుపు ఛాయతో
గిర్రున పరుగు విడిచాడు భూతల స్వర్గాలపై
అస్తమించాడు ముక్కోణాల శిఖరాలకు ఆవల''

పైడిరాజు చిత్రకారుడు కాబట్టే పై కవితలో రంగులు, రూపాలు కనిపిస్తున్నాయి. ఉదయ భానుడు నారింజ పండులా ఉదయించి, పసుపు ఛాయతో ప్రసరించాడు - చిత్రకారుడైన వాడు మాత్రమే చూడగలిగినది - కవితాశక్తి ఉండబట్టే కవితగా మలిచారాయన. అలాగే, 'సముద్రపు తరంగాలలోంచి మెలమెల్లగా' అని రాయచ్చు. కాని ఆ సముద్రానికి విశేషణమైన 'నీలి' రంగును జోడించడం ఆయనలోని చిత్రకారుడి పనే. అలాగే భూమి వట్టి భూమిగా కాక 'చదును'గా వర్ణితం. ఈ వర్ణన కవిలోని చిత్రకారుని 'రూప' దృష్టి. మామూలు కవి అయితే ''అస్తమించాడు కొండల కావల'' అని వ్రాయవచ్చు. కాని పైడిరాజు 'చిత్రకవి' కాబట్టి, ''ముక్కోణాల శిఖరాల ఆవల'' అనగల్గాడు. రూపపరమైన పరిశీలన, వర్ణగతమైన పరిశోధనలు ఈ విధంగా చిత్రకారులైన కవుల కల్పనలో చోటు చేసుకుంటాయి. ఆయన శిల్పి కూడా కాబట్టి, మరో కవితలో -

''చెత్తలోంచి తీసిన ఎంగిలి పొత్తర్లు నా కవితలు
స్క్రాప్‌లోంచి షేప్ చేసిన పిచ్చివ్రాతలు'' అన్నారు.

మట్టి ముద్దలోనో, నల్లరాయిలోనో ఉన్న రూపాన్ని బహిర్పరుస్తాడు శిల్పి. అలానే పైడిరాజుగారు తన వ్రాతల్ని, కవితల్ని సైతం 'స్క్రాప్' లోంచే 'షేప్' చేశారు. అందుకే సంజీవదేవ్ ఆయన కవితల్ని 'బొమ్మల కవితలు' అన్నారు. 'ఆ గడియకు గెడ విడింది' వంటి విలక్షణమైన కవితలతో పాటు 'ఉల్లిపాయ- మిరపకాయ' వంటి జానపద బాణీలు ఈయన కవితల్లో ఉంటాయి. అలాగే 'లపుక లపుక లాం లాం' అనే డప్పు దరువు పాట కూడ జానపద బాణీలో సాగుతుంది.

**శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి:** చిత్రకారుల కవిత్వానికి ఒక మౌలిక లక్షణం ఉంటుంది. మొక్కపాటివారి కవితల గురించి మాట్లాడుతూ ఆ విషయాన్ని చెబుతారు సంజీవదేవ్-''మొక్కపాటి కవితలు భావోద్దీపకం. రంగుల్నీ, రేఖల్నీ చిత్రించిన చేయి ఆ కవితల్ని కూడా రచించడం వల్ల ఆయన కవితలు వింటూంటే కళ్ళముందు రంగులూ, రేఖలే ప్రత్యక్షమయినవి'' అన్నారు, ఆయన కవితలను విన్నప్పుడు కలిగిన అనుభూతిని గురించి రాస్తూ. అంతే కాకుండ, ''కవితల్ని రచించిన చేయే చిత్రాన్ని కూడా రచించడం వల్ల ఆయన చిత్రాన్ని చూస్తుంటే చెవులకు కవితలు వినిపించసాగుతవి'' అని కూడా అంటారు.

చేయి చిత్రాన్ని చిత్రించినా, కవితని రాసినా దానికి ఆలోచనను అందించిన మెదడు ఒకటేనన్నది యిక్కడ గుర్తించాలి. సంప్రదాయబద్ధుడైన కళాకారుడు మరే కళలోనైనా సరే సంప్రదాయాన్నే అనుసరిస్తాడు కాని, నియతి రాహిత్యాన్ని సాధించలేడు. అలాగే సంప్రదాయాన్ని తోసిపుచ్చగల కళాకారుడు మరే కళారంగంలోనైనా సరే భావస్వేచ్ఛని కనబరుస్తాడు. నియతిరాహిత్యాన్ని సాధించి, కొత్తకొత్త పుంతల్లో సంచరిస్తూ కొంగ్రొత్త కళా సంవిధానాలను అనుసరించగలుగుతాడు.

**శ్రీ శీలా వీర్రాజు:** విలక్షణమైన శైలి, ఇతివృత్త వైవిధ్యం, గొప్ప శిల్పం రచయితగా శీలావీ ప్రత్యేకత. రచనలోనున్న వైవిధ్యం చిత్రకళలో అసంఖ్యాకంగా వెలువరించే ముఖపత్ర రచనల్లో కనబడుతుంది. ఈయన రాసిన నవల 'మైనా' చాల గొప్పది. ఒక పోలీసు కానిస్టేబుల్ స్వీయ కథాత్మకంగా సాగిన ఈ నవల శైలిలో- చిత్రకారుడు కావడంతో- పదచిత్రాలతో ఒక విలక్షణమైన వాతావరణాన్ని సృష్టించ గలిగారాయన.

చిత్ర రచన విషయానికొస్తే శీలావి సంప్రదాయసిద్ధమైన కళాకారుడు. ఆయనది ప్రాచ్య

సంవిధానం. రేఖలు, వాటిమధ్య పరచిన రంగుల కాంతులతో రూపపుష్టిగల చిత్రాలు ఆయనవి. చిత్రకళకు సంబంధించిన ఈ దృక్పథాన్నే రచనాపరంగా కూడ ఆయన వెలిబుచ్చారు- 'సామాన్యుల గుండెల్లోకి' అనే కవితలో సమకాలీన కవిత్వాన్ని తూర్పారబట్టారు. ఆధునికత పేరుతో అబ్‌స్ట్రాక్ట్ పోయెమ్స్, కళా సంస్కృతులు పక్కదారులు పట్టిపోగా వెర్రితలల ఆలోచనల్లో పుట్టిన పిచ్చిగీతల్ని అద్భుతమైన కళాఖండాలుగా చెలామణీ చెయ్యడాన్ని ఆయన అంగీకరించలేదు. మాటల గారడీలు లేని, మార్మిక భావాల ముసుగులు తొడగని నిరాడంబర కవితని ఈ తరం ఆశిస్తున్నదని శీలావి చెబుతారు. పెన్నుల్ని వంచుతూ గన్నుల్ని పట్టుకొమ్మనే చిత్తశుద్ధి లేని దగాకోరు కవులు, అర్థంకాని పదాల సర్కస్ ఫీట్ల అత్యాధునిక అబ్‌స్ట్రాక్ట్ కవులు, మోడ్రన్ మిస్టిక్ కవులు ఈ సమాజానికి అవసరం లేదని నిర్ద్వంద్వంగా ఖండించి చెబుతారాయన.

మధ్యతరగతి మనిషి మానసిక విశ్లేషణను తన కళాత్మకమైన అభివ్యక్తితో రచనలు చేసి తనదైన స్థానాన్ని శీలావి స్థిరం చేసుకున్నారని ఆయన సాహిత్యంలోని వస్తురూపాలను సమగ్రంగా పరిశీలించి సమీక్షాత్మక సిద్ధాంత వ్యాసాన్ని వెలువరించిన సంపతి బాల్‌రెడ్డి అభిప్రాయ పడ్డారు. శీలావిపై కాల్పనిక ధోరణి, బుచ్చిబాబు కథాశిల్పంలోని చిత్రకళాశైలీ ప్రభావం ఉందంటారాయన. ప్రకృతి ధర్మాలు, ప్రవృత్తి ప్రాచిత్యాలనేవి మనిషిని నిరంతరం వెంటాడుతాయి. మౌలికంగా భావుకుడైన ఒకచిత్రకారుడి నైజంతో శీలావి ఈ యదార్థాన్ని మనోవిశ్లేషణాత్మకంగా వివిధ ప్రక్రియల్లో తీర్చిదిద్దారని అంటారాయన.

**శ్రీ ఉల్చి:** సంప్రదాయక నియతి యొక్క కళాసాహితీ తత్త్వానికి శీలావిని పరిశీలిస్తే, దానికి విరుద్ధమైన ఆధునిక స్వేచ్ఛానియతి రాహిత్యం యొక్క కళాసాహితీ తత్త్వ వివేచనను 'ఉల్చి'ని పరిశీలించడం ద్వారా చేయవచ్చు. ముందుగా ఉల్చి శిల్ప, చిత్రకళా విధానాలను పరిశీలిద్దాం.

ఉల్చిది సంప్రదాయ చిత్రకళే అయినా, గొప్ప నైరూప్యతను సాధించిందాయన శిల్పం. వీరు పని చేసిన బాపట్ల వ్యవసాయ కళాశాల ఆవరణలో ప్రతిష్ఠించిన స్వరజతి, అభినేత్రి, దిరే, రాగప్రతిష్ట, లవర్స్ అండ్ షెల్టర్ మొదలైన శిల్పాలు గొప్పనైరూప్యాలు. స్వరజతి శిల్పంలో ఆధారం- బాసింపట్టు వేసిన రెండు కాళ్ళు, పైన వీణను పట్టుకున్న రెండు చేతులతో అస్పష్ట స్త్రీ మూర్తి దర్శనమిస్తూ సంగీతం పలికిస్తుంది. అలాగే 'అభినేత్రి' శిల్పం కూడా. 'లవర్స్ అండ్ షెల్టర్', 'దిరే' శిల్పాలు పూర్తిస్థాయి నైరూప్యతను సాధించాయి. స్వాప్నిక సర్రియలిస్టు భావనలకు ప్రతీకలివి. అందుకే ఉల్చి గురించి చెబుతూ సంజీవదేవ్ - ''ప్రతి కళాకారుడు ఓ స్వాప్నికుడు... అదీ ఓ జాగృత స్వాప్నికుడు.... సదృశసాకార స్వాప్నికుడు.... నిశ్శబ్ద స్వాప్నికుడు. ఉల్చి కళాకారుడు... తద్వారా ఓ స్వాప్నికుడు... ఓ స్వాప్నికుడు, తద్వారా ఓ కళాకారుడు... ఆయన స్వప్న భ్రాంతులకు నిజాకారాల నిచ్చే మాంత్రికుడు'' అంటారు.

ప్రతి కవికీ, కళాకారునికీ తనదైన భాష, బాణీ ఉన్నట్టే ఉల్చి కూడా కళాప్రపంచం కోసం కొన్ని కొత్త సంవిధానలతో రూపొందిన వర్గ భాషను నిర్మించాడు. ఆ భాషకు ఛందో భేదాలు కూడా సృష్టించాడు - Atomic brush ways, cosmic spectrum, water antics, water graphics, యింకా water cubs కూడా. శిల్పిగా శిల, దారు, లోహ, కాంక్రీటు వంటి మాధ్యమాలనన్నీ ఎన్నుకొని నిరుపమానమైన నైరూప్యాన్ని సృజించిన ఉల్చి అక్షర శిల్పాల్లో పూర్తిస్థాయి నైరూప్యాన్ని సాధించలేకపోయినా, ఆ ఛాయలు అక్కడక్కడా కనబడతాయి. సంప్రదాయ చిత్రణను అధికంగా చేసిన ఉల్చి కొన్ని నైరూప్య చిత్రాలను కూడ సృజించాడు (గ్రీఫ్, అనీమిక్ వర్జిన్). ఈ విధంగానే మంచి శిల్ప పుష్టిగల ఆయన కవితల్లో నైరూప్య భావాలు, వర్ణనలు క్వాచిత్కంగా కనిపిస్తాయి. ప్రాకృతిక మానవీకరణకు పరాకాష్ఠలనదగిన భావాలు కంటికందే నైరూప్యాలుగా జాలువారతాయి.

''సముద్రానికి రోజూ సీమంతమే.... సముద్రానికి రోజూ ప్రసవ వేదనే...'' అనడంలో ఒకదానికొకటి పొంతనలేని సముద్ర సీమంతాలు ఒకచోట కలిసి ఊహామాత్రమైన భావాన్నందిస్తాయి.

'' ఒక ప్రముఖ చిత్రకారుడు కవిగా అవతరిస్తే ఎలా ఉంటుందో 'రాతి పొత్తిళ్ళు' కవితా సంపుటి ఎలుగెత్తి చెబుతుం''దంటూ డా॥ సి. నారాయణ రెడ్డి, ఉల్చి కవితల్లో ''మన చూపులను అలా వెదజల్లుకుంటూ పోతే అడుగడుగునా పదచిత్రాలే ఎదురవుతాయి'' అంటారు. 'కాలుష్యం ఊబిలో అక్షరం' అనే కవితను ప్రారంభిస్తూ -

''భాష - అక్షరాలై పుట్టాలనే
ఊహకు మొగ్గలు తొడిగిన వయసు
మాట - అక్షరమయ్యే ఆకృతికోసం
అంతు చిక్కని అన్వేషణలో వేదన
జ్ఞానం - తనను తాను గుండె కొలిమిలో మెలికల్లా వంచుకుని
తల పండిన మెదడు కుటీరాల తలుపులు తెరిచి చూసింది....''

అంటూ, భాష, మాట, జ్ఞానం వంటి నైరూప్య పదార్థాలను వర్ణించిన తీరు కొంతలో కొంత నైరూప్యంగానే సాగుతుంది. అదే కవితలో-

''మేఘం మేఘం ఆకాశం పలకపై
అక్షర సృష్టిని నేస్తున్న దృశ్యాలే అన్ని దిక్కులు
భాష కాలం ఆనిరిలో పొదిగి
అక్షరంగా ప్రాణం పోసుకుంటున్న
సృజనకు సీమంతం'' అనడంలో

''మామూలు కవి కంటికి అందని దృశ్యాన్ని చిత్రకారుడి కంటి కొడవలి కోయగలుగుతుం'' దంటారు డా॥ నాగ భైరవ. ''సర్రియలిజం స్ట్రోకువు... పికాసో సిగ్నేచరు లేని రంగుల చేదు నిజానివి'' అంటూ ఉగాదిని శిల్పీకరించిన తీరు ('ఉగాది శిల్పం' కవిత) కేవలం చిత్రకారుడైన కవికే చెల్లుతుంది. 'పర్స్పెక్టివ్ మరకలు', 'ఉగాది శిల్పం', 'ముగ్గు గీతల్లో యింకిన వాళ్ళు' అన్న శీర్షికలు చిత్రకారుడైన కవిని పట్టిచ్చి అతని ఉపజ్ఞను తెలుపుతాయి.

**శ్రీ బుచ్చిబాబు:** వీరి కళాసాహితీ సవ్యసాచిత్వాన్ని స్పృశించకపోతే ఈ వ్యాసం సంపూర్ణం కాబోదు. రచయితగా అందరికీ బాగా తెలిసిన బుచ్చిబాబు, మునివేళ్ళు ముచ్చట పడితే చాలు కుంచె పట్టేవాడు. గీయాలనుకున్నదే తడవు పెన్సిల్ డ్రాయింగ్లు, స్కెచ్‌లు వేసేసేవాడు. బాపిరాజులానే బుచ్చిబాబు కూడ కవి, కథకుడు, నవలాకారుడు, చిత్రకారుడు, గాయకుడు, నాటక దర్శకుడు. హార్మోనియమో, వయోలినో వాయిస్తూ నాటకాల్లో పద్యాలు పాడడమన్నా, వినడమన్నా ఎంతో యిష్టపడేవాడు.

బుచ్చిబాబుకు చిత్రలేఖనంలో మంచి ప్రవేశముంది. అనేకమైన ఆయిల్ పెయింటింగ్స్‌ను - దాదాపు అన్నీ ల్యాండ్ స్కేప్ దృశ్యాలే - చిత్రించి, బ్రతికుండగా ప్రదర్శించాడు కూడా. అలాగే ఆయన నవలల్లో దీర్ఘమైన ప్రకృతి వర్ణన లుండడం అందరికీ తెలిసిందే. చిన్నప్పట్నుంచీ ప్రకృతి ఆరాధకుడాయన. తండ్రి ఉద్యోగరీత్యా తరచు కాలువల్లో పడవ ప్రయాణం చేయడంతో, ప్రకృతి కాంత సాంగత్యం బాగా అనుభవించాడు. సంధ్యా సమయంలో ఆకాశంలో వెల్లివిరిసే రంగుల మిశ్రమం బుచ్చిబాబుకెంతో యిష్టం. ప్రకృతిలో షికార్లు చేస్తూ, చెరువుల్లో దొరువుల్లో ఈత కొడుతూ గంటల గ్గంటలు గడిపే బుచ్చిబాబు పెయింటింగ్సులో ఆ దృశ్యాలే చోటు చేసుకున్నాయి. అవే ఆయన రచనల్లోనూ అక్షర చిత్రాలుగా రూపు దిద్దుకున్నాయి. తన నవల 'చివరకు మిగిలేది' తొలి ప్రచురణకు

ముఖచిత్రం ఆయనే గీసుకున్నాడు. అలాగే నండూరివారి ఎంకి పాటలను టైపు చేయించుకుని, ఒక్కో పాటకు ఒక్కో రేఖాచిత్రం గీసి, బౌండు చేయించి అపురూపంగా దాచుకున్నాడాయన. దీనివల్ల ఆయన చిత్రలేఖనాభిరుచి తెలుస్తుంది. ఎంకి పాటల రేఖాచిత్రాల బౌండు పుస్తకాన్ని చూచిన బాపిరాజు, ''నా పాటలకి కూడా బొమ్మలు నువ్వు గియ్యాలి సుమా'' అన్నారు.

భావనలో, భాషలో, ఇతివృత్త నిర్వహణలో, వర్ణించడంలో... అన్నింటా కళాకారునిగానే కనబడతాడు బుచ్చిబాబు. ఆయన ఆలోచనలన్నీ వర్ణచిత్రాలలాగే ఉంటాయి. ఆయనశైలి మాటల్ని రంగుల్లో ముంచి కుంచెతో బొమ్మ గీసినట్లుంటుంది. ఆయనలోని సౌందర్య పిపాస ప్రకృతి వర్ణనల్లోనూ, స్త్రీ పురుషపాత్రల ఆకృతుల వర్ణనల్లోనూ కనిపిస్తుంది. ఆయన స్వీయ చరిత్రలోని 'అంతరంగ కథనం' - ఆయన పరిశీలనను, భావుకతా దృష్టిని, భావావేశాన్ని తెలుపుతాయి.

**శ్రీ కాపు రాజయ్య:** 'కుంచె పదాలు' వచన కవితా సంకలనాన్ని కె. రాజయ్య ప్రచురించారు. వీరిది సంప్రదాయ చిత్రణలో జానపదశైలి. వీరి కవితా సంపుటికి ఉంచిన పేరు వీరి చిత్ర వచనాశైలికి అనుగుణంగానే ఉంది. 'పదాలు' జానపద కవితారూపం. కావాలంటే 'తూలికాపద్యాలు' అని గంభీరమైన పేరు పెట్టొచ్చు. కానీ అలా పెట్టలేదు. 'కుంచె పదాలు' అనడంలోనే కాపు రాజయ్య జానపద దృష్టి విశదమౌతుంది.

కళాసాహితీ సవ్యసాచులుగా తదుపరి స్మరింపదగినవారు గుర్రం మల్లయ్య, మా గోఖలేలు. అలాగే చామకూర సత్యనారాయణ (కథకులు), డా॥ మాచిరాజు రంగారావు (కవి), డా॥ విప్పర్తి ప్రణవమూర్తి (కథకులు), చంద్రం (కథకులు), వి. రాజన్ (బాలుర నీతి కథలు), యీడూరి రామచంద్రరావు (కథలు, గేయాలు, నాటక రచయిత), బద్రి నారాయణ (కవి), శొంఠ్యాన నాగేశ్వరరావు (నాటక రచయిత) మొదలైనవారు ప్రసిద్ధులు. ఈ వ్యాస రచయిత మాకినీడి సూర్య భాస్కర్ కూడా కళాసాహితీ రంగాల్లో కృషి సలుపుతున్నాడు. ఇతని పద్య కవితా సంపుటి 'సుమ కవితాంజలి' కి రాసిన ముందు మాటలో డా॥ నాగభైరవ - ''ఈ పద్య ప్రసూనాలకి మంచి రంగూ వుంది. మంచి రుచీ వుంది. మంచి వాసనా ఉంది. చిత్రకారుడు కాబట్టే రంగును అద్దాడు. రుషిత్వం ఆవహించి రుచిని దిద్దాడు. వాక్పతీ కటాక్ష వీక్షణంలో తడిసి వాసననూ రుద్దాడు'' అంటూ, 'కవితా చిత్రకారుని'గా పేర్కొన్నారు.

ఒక కళామాధ్యమంలో అధికారం సంపాదించిన వ్యక్తి మరో కళా మాధ్యమంలో ఆత్మాభివ్యక్తి చేసుకోడం కొంత సులభమే అయినా, అనుకున్నంత సులభం కాదు. ఎందుకంటే, కొత్త మాధ్యాలను స్వీయాలుగా మార్చుకోగలగాలి. నిజానికి లలితకళలు ఒక్కొటీ ఒక్కో ధర్మాన్ని కలిగి ఉంటాయి. వాటికి చేయాల్సిన పరిశ్రమ కూడా వేరు వేరుగా ఉంటుంది. అయినా ఒక కళలో నిష్ణాతుడైన కళాకారుడు వేరే కళలోనికి ప్రవేశించడానికి కారణం, అటువంటి కళాసాహితీ సవ్యసాచుల అభిప్రాయాల్లోనే తెలుస్తుంది. తన కవితను గురించి చెబుతూ అంట్యాకుల పైడిరాజు, ''ఏ మార్గమైతేనేమి గమ్యస్థానం చేరుకోవడానికి? రంగుల టెక్నిక్‌లో చిత్రాల ద్వారా నా ఊహలు ప్రదర్శించడం మాత్రమే కాదు నాక్కావలసింది. మాటల టెక్నిక్‌లో కూడా నా ఊహలు తెలపడం నా అభిమతం'' అన్నారు. అలానే ఉల్చి కూడా, ''చిత్రకారుడిగా, శిల్పిగా అందరికీ పరిచితుడనైన నన్ను నేను మరో కొత్త కోణంలో కవిగా పరిచయం చేసుకునే ఉద్దేశమే ఈ 'రాతి పొత్తిళ్ళు' పుస్తక ప్రచురణ' అన్నారు. అంటే దీన్నిబట్టి తెలిసేదేమంటే, కళాకారుడు తన అభివ్యక్తిని జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు మరో కళారంగంలోనికి కూడా మళ్ళించాలనుకుంటాడని. ఈ కారణంగానే తన డెబ్బైయ్యో యేట రవీంద్రనాథ్ టాగూర్ చిత్రకారుడుగా మారాడు. చిన్నతనం నుంచీ అప్పుడప్పుడూ బొమ్మలు గీయడానికి ప్రయత్నించినా ఎప్పుడూ సఫలం కాలేదాయన. అప్పట్లో పెన్సిల్‌తో గీసిన దానికంటే, రబ్బరుతో చెరిపినదే ఎక్కువని ఆయనన్నారు. అయితే, కోరిక బలీయం కావడంతో చివరికి ఆయన తన జీవిత చరమాంకంలో చిత్రకారునిగా అవతరించగలిగారు.

# కన్యాశుల్కము

## 19వ శతాబ్ది ఆధునిక భారతీయ నాటకములు

డా॥ యు. ఏ. నరసింహమూర్తి

*(గత సంచిక తరువాయి)*

అగ్నిహోత్రావధాన్లు వెంకమ్మల మధ్య సాగిన సరాగమెలా ఉందో 'శారద' నాటకంలోని కాంచనభట్టు - ఇందిరాబాయిల మధ్యనున్న సౌభాగ్యం కూడా అలాగే వెలిగింది. '' ఆడముండల్తోనా ఆలోచన? యీ సమ్మంధం చైకపోతే నేను బారిక రావుఁణ్ణో'' అన్న అగ్నిహోత్రుడికి కాంచనభట్టు ఏమీ తీసిపోలేదు.

"But who is going to ask your opinion? And what do you understand of these things? Your understanding is limited to the kitchen"అంటూ ఇంకా ఇంకా దూకుడుగా సాగుతుందా సంభాషణ.

సౌజన్యారావు పంతులుకు అగ్నిహోత్రావధాన్లకు మధ్యనడచిన సంభాషణ ఇలాగుంది.

సౌజ : ఇక మిమ్ములను జయించినవాడులేడు. పిల్లల్ని అమ్ముకోవడం శిష్టాచారం అంటారండీ?

అగ్ని : ఆహా! మా మేనత్తల్ని అందరినీ కూడా అమ్మారండీ, వాళ్లంతా పునిస్త్రీ చావే చచ్చారు. మా తండ్రి మేనత్తల్ని కూడా అమ్మడవేఁ జరిగిందిష. వైధవ్యం అనుభవించిన వాళ్లంతా పూర్వకాలంలో యెంత ప్రతిష్ఠగా బతికారు కారు?

సౌజ : పసిపిల్లల్ని కాలంగడచిన వాళ్లకు పెళ్లి చేస్తే వైధవ్యం రాక తప్పుతుందా? నింపాదిచేసి కొంచెం యోచించండి.

అగ్ని : ప్రాలుబ్దం చాలకపోతే ప్రతివాళ్లకీ వస్తుందండి. చిన్నవాళ్లకిచ్చినా పెద్దవాళ్లకిచ్చినా రాత యెనడైనా తప్పించగలడా?

శారద తండ్రి కాంచనభట్టుకి తల్లి ఇందిరాబాయికి మధ్యనడచిన సంభాషణ ఇలా ఉంది.

**Indira Bai :** Of course, we are only cattle and our understanding is limited, but does it become a human being to sell his daughter for wealth to a dotard?

**Kanchanabhat:** And why not? Hasn't been done before and won't it happen in future? And unless I do that how can I recover the amount spent on her upbringing for these fourteen years?

**Indira Bai** : (shocked) I no, how I hate that kind of language. I wonder how cruel man can be ! (song)

...... ...... ....... ....

Does she need no conjugal bliss?

Barrenness you buy her, by marrying her off a dotard?

**Kanchanbhat:** Now, how can I convince her, Have you never seen or at least

---

డా॥ యు. ఏ. నరసింహమూర్తి, విజయనగరం, మహారాజా కళాశాలలో
తెలుగు శాఖాధ్యక్షులుగా పని చేస్తున్నారు.

heard that: (song)

Widows become how many girls, though they marry youths
How many husbands old live to see their grand children
In the lap of God are happiness, children and conjugal bliss
No control have we over any of these

ఈ సంభాషణలు కేవలం అనువాదాల్లా కనిపంచడం లేదా? నాటకాలు రెండింటినీ సన్నిహితంగా పోల్చి చూస్తే ఈ పోకడలు ఇంకా స్పష్టంగా బయటపడగలవు.

కన్యాశుల్కం - శారద నాటకాల మధ్య ఇంత సన్నిహితత్వం ఎలా సాధ్యపడింది? కన్యాశుల్కాన్ని 1892లోనే ప్రదర్శించారు. అప్పటి నుండి దాని గురించిన ప్రచారం జరుగుతూనే ఉంది. 1897 జనవరి 21వ తేదీన ఒక దినపత్రికలో కన్యాశుల్కం మీద సమీక్ష ఉందని నార్ల రాసేరు. ది పీపుల్స్ ఫ్రెండ్, ది వీక్లీ రెవ్యూ, ది దినమణి, ది తెలుగు హార్టు - లాంటి పత్రికలలో కన్యాశుల్కం మీద సమీక్షలు వెలువడ్డాయి. అంతేకాదు. ''1897 జనవరి 2న తన డైరీలో 'మహారాజా హోల్కారు ఆగమనం' అని ఆయన రాసుకున్నారు'' అని నార్ల రాసేరు. విజయనగరం సంస్థానాధీశులకు, మహారాష్ట్రలోని సంస్థానాధీశులకు సన్నిహిత సంబంధాలు, రాకపోకలు ఉన్నాయి. అలాంటి తరుణాలలో ఎప్పుడైనా, ఏ విధంగానైనా గురజాడ - దేవల్‌ల మధ్య ప్రత్యక్ష సంబంధం ఏర్పడిందా? దేవల్ పరోక్షంగానే కన్యాశుల్కం నాటకం చేత ప్రభావితులయ్యారా? కథాగమనం చూసినా, సంభాషణలు చూసినా శారద మీద కన్యాశుల్కం ప్రభావం స్పష్టంగానే తెలుస్తాంది. జిజ్ఞాసువులు ఈ విషయాన్ని ఇంకా లోతుగా పరిశీలించవలసి ఉంది. కన్యాశుల్కం శారదను ఎంతగా ప్రభావితం చేసిందో అలాగే సమకాలీన ఆధునిక భారతీయ నాటకాలన్నిటినీ అంతగా ప్రభావితం చేసిందా? అన్న విషయాన్ని కూడా పరిశోధించవలసి ఉంది.

అస్సామీ - బెంగాలీ - ఒరియా నాటకకర్తల లాగే ఆధునికహిందీ నాటకపితామహుడు భారతేందు హరిశ్చంద్ర కూడా హాస్యాన్ని ఆయుధంగా చేపట్టి 'వైదికీ హింసా హింసాన భవతి' (1873), 'అంధేరీ నగరీ చౌపట్‌రాజా' (1881) వంటి నాటకాలు రాసి మాంస భక్షణం, మద్యపానం వంటి వ్యసనాలకు లోబడ్డ ఉన్నత వర్గాలలోని కుహనా సంస్కారులను, అసమర్థులు - అవినీతిపరులు అయిన అధికారులను విమర్శించేడు. దేవల్ ఇదంతా చూసి, తెలిసికూడా, కన్యాశుల్కాన్ని అనుకరిస్తూ రాసిన శారద నాటకాన్ని సంస్కృత నాటక ఫక్కీలోనే రాసేడు. ఆ నాటకంలోని సులభము - ఆకర్షకము అయిన సంగీతం, సహజమైన భాష ఆ నాటకానికి మంచి వ్యాప్తిని కలిగించాయి.

కన్యాశుల్కం నాటకంలోని పాత్రల పేర్లు పెట్టడంలో గురజాడ కృత్రిమత్వాన్ని ప్రదర్శించాడని విమర్శ ఉంది. ఆయన అభిమానులు కూడా ఈ విమర్శకు పాల్పడ్డారు. గుణనిధి - నిగమశర్మ వంటివారు మనకు కొత్తకాదు. గురజాడకు పూర్వులు, సమకాలికులు కొందరు ఈ త్రోవ తొక్కారు. మైకేల్ మధుసూదనదత్తా సృష్టించిన నవకుమార్, దేవల్ సృష్టించిన భుజంగనాథుడు - కాంచనభట్టు ఇలాంటివాళ్లే. అందువలన వాళ్లకేమీ చెడ్డపేరు రాలేదు. గురజాడ కంటె ముందుగా రామస్వామి రాజు మొదటి తమిళ స్వతంత్ర నాటకం ''ప్రతాప చంద్రవిలాసం'' (1877) రాసేడు.[25] నాటక రచన ద్వారా యువకులను సన్మార్గానికి మళ్లించడం రామస్వామిరాజు ఆశయం. అతని నాటకంలో విద్యాసాగరన్, నిపుణ కోశరర్, స్వదేశ మిత్రర్, పురాతనర్, లౌకికర్, విశ్వాస ఘాతుకర్ వంటి పాత్రల శీలానికి సంబంధించిన పేర్లు కనిపిస్తాయి. దేశమంతటా ఉన్న ఆలోచనే ఈ నాటకంలోనూ కనిపిస్తుంది. పెచ్చు పెరుగుతున్న పాశ్చాత్య నాటక వ్యామోహాన్ని అరికట్టాలి, గ్రామీణ దారిద్ర్యాన్ని

రూపు మాపాలి - వంటి ఆశయాలు ప్రతాప చంద్ర విలాసంలో కనిపిస్తాయి. ఈ నాటకం చదివిన వారికి గురజాడ కన్యాశుల్కంలో పెట్టిన పేర్లు కృత్రిమంగా కనబడవు.

1927లో కె. కృష్ణయ్యంగార్ కన్యాశుల్కాన్ని కన్నడంలోకి అనువదించేరు. ఆధునిక కన్నడ నాటకాలను గూర్చి రాస్తూ H.K. రామచంద్రమూర్తి రాసిన మాటలు ఇక్కడ యథాతథంగా పేర్కొనదగినవి.

"Around 1925 was born what may be called the elite drama theatre. There were of course, earlier anticipations like 'Igappa Heggade Vivaha Prahasana' (1887) It was the first independent Kannada play and was written in the havyaka dialut of North Canara. It was non-mythical, and it made use of stork realism and aimed to severe social criticism. It exposed the cross folly of a society which permitted a very man to man a very young girl, only because of his wealth."[26]

ఈ రాతని బట్టి కన్యాశుల్కం కంటె ముందుగా కన్నడంలో 'ఇగప్ప హెగ్గడె వివాహ ప్రహసన' - మాండలిక భాషలో రచింపబడినట్లు తెలుస్తోంది. కన్యాశుల్కం కనీసం భాష విషయంలో ఆ నాటకానికి వెనకబడిందని అనుకోవాలా? కాని "At least two plays were written in Kannada in the year when Kanyasulkam was published. They are "Kanyavikraya" by Dhareswara Siva Rao and "Iggappa Heggadeya Vivaha Prahasana" by Karki Venkata Ramana Sastry. All the three plays deal with similar themes though none is indebted to the other"[27] అన్న రాతను బట్టి కన్యాశుల్కం ప్రచురణ జరిగిన సంవత్సరమే, అలాంటివే రెండు నాటకాలు కన్నడంలో వచ్చాయని తెలుస్తోంది. ఈ రెండు రాతల్లో ఏది నిజమో పరిశీలించవలసి ఉన్నది.

కన్యాశుల్కం తన సమకాలీన సాంఘిక నాటకాలలో ఉన్న విషయాలన్నింటిలోనూ భాష విషయంలో ముందంజ వేసిందన్న అధికగుణాన్ని కూడా ఒక కన్నడ నాటకం తోసిరాజన్న సంగతి ఇందువలన తెలుస్తోంది. అది ఏ మేరకు? అందులోని గుణగణాలెలాగున్నాయి? అనే విషయాన్ని అధ్యయనం చెయ్యాలి. అది పరిశోధకుల పని. రచయిత ఒక కొత్త సాహిత్య భాషను సృష్టించడానికి, సర్వజన సులభమైన ఒక వచనశైలిని రూపొందించడానికి గురజాడ తీవ్రమైన ప్రయత్నం చేసేడు. ఆయన కన్యాశుల్కానికి కూర్చిన పీఠికలు చదివినా, డిసెంటుపత్రం చదివినా ఈ విషయం తెలుస్తుంది. ఇక్కడ ముందుగా ఆకళించుకోదగ్గ సత్యం ఇంకొకటుంది. ఆధునిక భారతీయ భాషలలో వచన వికాసమన్నది బ్రిటిషు వారి భిక్ష. ఆ ఆలోచన వారిదే, ప్రేరణా వారిదే. ఆ విషయంలో వారి ప్రయోజనాలు వారి కున్నాయి. 1800 సంవత్సరంలో కలకత్తాలో ఫోర్టు విలియమ్ కాలేజీ నెల కొల్పడం భారతీయ భాషలలో వచన వికాసానికి అధికారిక ప్రారంభమని చరిత్రకారులు చెప్తున్నారు.[28] గుణాభిరామ్ బారువ అస్సామీలో వచన విప్లవాన్ని తెచ్చిన రచయిత. అక్కడ నుండి చూస్తే ఆ కాలంలో ఒక్క తెలుగులోనే కాక అన్ని భారతీయ భాషలలోనూ గ్రాంథిక - వ్యావహారికశైలుల మధ్య 19వ శతాబ్దం చివరిపాదంలో నిరంతర వివాదం నడుస్తూన్నట్లే తెలుస్తోంది. ఆ వివాదం 20వ శతాబ్దంలో కూడా అంత తేలికగా సమసిపోలేదు. అయితే తెలుగులో 19వ శతాబ్ది చివరిలోనే అది ఒక బలమైన ఉద్యమంగా మారింది. ఆ ఉద్యమ నాయకులలో ఒకడుగా, సాహితీపరుడుగా గురజాడ 'కన్యాశుల్కం' సృష్టించేడు. ఆ ఉద్యమానికి బలమైన సాహిత్య నేపథ్యాన్ని సంతరించిన వైతాళికుడుగా గురజాడ దేశమంతటా ప్రఖ్యాతుడయ్యాడు. మాండలికంలోని జీవశక్తులన్నీ కన్యాశుల్కంలో

గూడుకట్టుకున్నాయి. ఆ స్థాయిని కన్నడ నాటకం గాని, ఇతర భాషల నాటకాలు గాని ఆ కాలంలో అందుకున్నాయా? లేదా? అన్న విషయాన్ని పరిశోధించాలి.

మన విమర్శకులు కన్యాశుల్కాన్ని మృచ్ఛకటికంతో, కొన్ని పాశ్చాత్య నాటకాలతో పోల్చి చూడడానికి ప్రయత్నించారే గాని సమకాలీన భారతీయ నాటకాలతో పోల్చి కన్యాశుల్కం స్థానాన్ని నిర్ణయించడంలో బాధ్యతను ప్రదర్శించలేదు. మృచ్ఛకటికంతో ప్రభావితమైనా కన్యాశుల్కం ఆ నాటకానికి ఋణగ్రస్తం కాలేదు. స్వతంత్ర లక్షణాన్ని ఆవంతైనా కోల్పోలేదు. షేక్స్పియరు నాటకాలు చెప్పి చెప్పి ఎలిజబెత్ కాలంనాటి నాటకశిల్పాన్ని గురజాడ వదలించుకోలేకపోయారని సి. ఆర్. రెడ్డి అన్నారు. ఒక్క గురజాడే కాదు, ఆ కాలపు భారతీయ నాటక కర్తలందరూ ఆ శిల్పానికి లోబడినట్లు తెలుస్తూంది. కాని గురజాడ ఆ ఒక్క శిల్పానికే కట్టుబడి ఉండిపోలేదు. షేక్స్పియర్, రాబర్ట్సన్ ప్రభావాలు రెండూ కనిపిస్తాయన్నారు నార్ల.[29] థామస్ విలియమ్ రాబర్ట్సన్ రాసిన 'Caste' నాటకాన్ని చూసినట్టుగా గురజాడ తన డైరీలో రాసుకున్నాడు కాబట్టి ఆయన దానిచేత ప్రభావితుడై కన్యాశుల్కాన్ని రాసేడని నార్ల వారనుకున్నారు.[29] నార్లవారు రాబర్ట్సన్ను ఆధునిక నాటక వైతాళికుడు అన్నారు. ప్రేక్షకులు తమ సొంత విషయాలను నాటక రంగం మధ్యకు తీసుకువెళ్లేటట్లు చేయడం, అచ్చం తమ సొంత ఇళ్లలో వినే మాటల్లోనే వాటిని తేల్చుకోవడం - అనే లక్షణాలను గురజాడ రాబర్ట్సన్ నుండి నేర్చుకున్నట్లు నార్లవారు భావించేరు. ఈ రెండు లక్షణాలు ఇతర భారతీయ భాషా నాటకాలలో కూడా ఆ కాలానికి కనిపిస్తూన్నట్లు తెలుస్తూంది. రాబర్ట్సన్ నాటకాలకు Cup-Saucer dramas అని పేరు. నాటక రచనలో గురజాడ లక్ష్యం అదికాదు. 'Caste' నాటకం ఆభిజాత్య లక్షణాన్ని నిరసించేదిగా కనిపిస్తుంది. 'Caste' నాటకం 1867లో తొలిసారిగా లండన్లోని ప్రిన్స్ ఆఫ్ వేల్స్ థియేటర్లో ప్రదర్శితమయింది. మెలోడ్రామాను వ్యతిరేకిస్తూ ఒక కొత్త వాస్తవికవాద ధోరణిని అందించిన నాటకమది. ఈ నాటకం ఈస్తర్ ఎక్లేస్ (Esther Eccles) అనే బాలే నర్తకి స్వేచ్ఛా ప్రకృతిని వివరిస్తుంది. వర్గవైషమ్యాన్ని ఎదిరిస్తూ ఆమె ఒక ఉన్నత కుటుంబంలోని జార్జి అనే యువకుణ్ణి పెళ్లాడుతుంది. వాళ్లిద్దరూ సుఖంగా కాపురం చేస్తారు. ఈలోగా జార్జి ఇండియాలో మరణించినట్లుగా వార్త వస్తుంది. జార్జి తల్లి తన మనమడి సంరక్షణ బాధ్యత తనదే కాని దరిద్రురాలైన ఈస్తరుది కాదని వాదిస్తుంది. ఈస్తరు ఆమె ప్రయత్నాన్నెదుర్కొని తిరిగి క్లబ్బుల్లో నృత్యాలు చేసి కొడుకును పోషించుకోవాలని నిర్ణయించుకుంటుంది. ఈలోగా జార్జి తిరిగి వచ్చి తన భార్యను బిడ్డను ఆదుకుంటాడు. మొత్తంమ్మీద నాటకంలో ఎక్కువ పాత్రలు ఆభిజాత్యాన్ని విమర్శిస్తాయి. ఇది 'Caste' వృత్తాంతం.[30] ఇక్కడ మనం గమనించ దగిన అంశాలు రెండున్నాయి. 'Caste' మన దేశానికి పరిచయమయ్యే సమయానికే, మన నాటక రంగంలో రాజ్యమేలుతూన్న మెలోడ్రామా పట్ల వ్యతిరేక బీజాలు సర్వత్రా అంకురించడం ప్రారంభించాయి. 'Caste' లోని ఆభిజాత్య వ్యతిరేక దృక్పథంతో ప్రభావితుడై గురజాడ కన్యాశుల్కం బ్రాహ్మణుల ఆభిజాత్యాన్ని వ్యతిరేకించే ధోరణిని ప్రదర్శించాడని నార్లవారి అభిప్రాయం. కాని గురజాడ బ్రాహ్మణుల ఆభిజాత్యాన్ని విమర్శించడం లక్ష్యంగా కన్యాశుల్కాన్ని రాయలేదు. ఉన్నవాళ్లూ లేనివాళ్లూ అనే వర్గవైషమ్యం మీదా దృష్టి పెట్టలేదు. సమాజంలోని కుళ్లునంతటినీ వర్ణ విభజన, వర్గ విభజన అనే భేదం లేకుండా కడిగిపారెయ్యడానికి కన్యాశుల్కాన్ని ఒక సాధనంగా ఎంచుకున్నాడు. అలాకాక పోయినట్లైతే, ఒక్క బ్రాహ్మణులను విమర్శించడం కోసమే రాస్తే, పేకాట సీను - సారాకొట్టు సీను - కోర్టు సీను అంటూ నాటకాన్ని పెంచుకుంటూ పోయి ఉండేవాడు కాదు. హెడ్డు - ఇనస్పెక్టరు - తాసీల్దారు - మునసబు - సబ్ కలెక్టరు - ఇలా ఎందరో రంగం మీదకు వచ్చేవారు కారు. రాబర్ట్సన్ నాటకాలు గురజాడ చదివి ఉండవచ్చును. అందులో కొంచెం పేరుపడిన 'Caste' నాటకం చూసి ఉండవచ్చును. కాని అంతకంటె

గొప్పవారి నాటకాలెన్నో ఆయన చదవడం, చూడడం జరిగింది. కలకత్తా, మద్రాసు వంటి నగరాలలో ఆయన దేశ, విదేశీ నాటకాలను చూసేడు. రాబర్ట్సన్‌కాలంలో మెలోడ్రామా ఎంతహంగామా చేసిందో, గురజాడ కాలంలో మహారాష్ట్ర సంచార నాటక సమాజాలు పార్సీ, హిందూస్థానీ నాటకాలు భారతదేశంలోని గ్రామ గ్రామాన ప్రదర్శించి అంతకంటె ఎక్కువ హంగామా చేసాయి. ''అజ్ఞాన జనితమైన ఆ మహదానందం'' మీద తిరుగుబాటుగా గురజాడ ఒక సరికొత్త సాహిత్య భాషలో కన్యాశుల్కం రాసేడు. రాబర్ట్సన్ కూడా నవ్య వాస్తవికతను, వాడుక భాషను ఉపయోగించడం కాకతాళీయం. గురజాడను ప్రభావితం చేయగల మహత్త్వం రాబర్ట్సన్‌లో లేదు. Robertson is significant of his time because of his success with peculiar combination of sentiment and shallow worldliness which inspired the epithet "Cup and Saucer". While as he himself recognized, he was not a great actor, and while his plays, intimate, satirical and thinly clever, are no longer well known well known of important"[31] అన్న విమర్శను కూడా మనం గుర్తించాలి.

కన్యాశుల్కంలో నిర్మాణ సౌష్ఠవం కొరవడిందన్న విమర్శ ఉంది. దీనబంధుమిత్ర - జగమోహన లాలా వంటి ప్రసిద్ధుల నాటకాలలో కూడా నిర్మాణ సౌష్ఠవం కొరవడింది. కొత్త ప్రయోగం చేస్తూన్నప్పుడు సమగ్ర సౌష్ఠవాన్ని సాధించడం అంత తేలిక కాదు. అంతే కాక సమకాలీన భారతీయ నాటక కర్తలు ఆధునిక దృష్టితో తమ నాటకాలలో ఏ వస్తువులనైతే స్వీకరించేరో ఆ వస్తువులన్నీ కన్యాశుల్కంలో ఉన్నాయి. అందుకే కన్యాశుల్కం సమకాలీన వ్యవహార సర్వస్వాన్ని ఆకళించుకున్న విజ్ఞాన సర్వస్వంగా రూపొందింది. మహా భారతాన్ని గూర్చి ''ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని'' వగైరా ప్రశంసలున్నాయి. అంత భారీ స్థాయిలో కాకపోయినా, తన పరిధికి తగినంతలో అనేక విషయాలను కాంతాసమ్మితం చేసిన దృశ్యకావ్యం కన్యాశుల్కం. బాల్య వివాహాలు, విధవా పునర్వివాహం, వేశ్యాసమస్య, జూదం, త్రాగుడు, మూఢ నమ్మకాలు, విద్య, చట్టం, అవినీతి, వ్యవస్థ - ఇలా రాసుకుంటూ పోతే ఆనాటి సమాజంలో ఉన్న సమస్యలన్నీ కొద్దో గొప్పో కన్యాశుల్కంలో కనిపిస్తాయి. ఇంతటి బహుముఖీనమైన వస్తువును జీవం చెడకుండా ఏ ఇతర భారతీయ నాటకకర్తా నిర్వహించలేదు. అందుకే అభిమానుల అత్యుక్తుల సంగతి అలా ఉంచినా - "Gurajada's play gave a new purpose to the Telugu theatre and opened a new world of experience to the Indian dramatist" అన్న వాక్యాలు ఉచితంగా కనిపిస్తాయి.

"There is the use of the body for communication, in separable in Indian music, dance and drama. A drama in action is a combination of all these three alongwith the spoken word."[32] అన్న కమలాదేవి ఛటోపాధ్యాయ ఉపోద్ఘాత వాక్యాలు ఆదర్శ నాటకాలకు వర్తిస్తాయేమో గాని మన పాత నాటకాలకు, కొత్త నాటకాలకు పూర్తిగా వర్తించడం లేదు. పాత నాటకాలలో వాడుక మాట లేదు, మిగిలిన మూడూ ఉన్నాయి. అయినా ఆ రోజుల్లో గ్రామీణ జనం సైతం వాటిని ప్రాణాధికంగా ఆదరించేరు. అది గురజాడ పేర్కొన్న ''అజ్ఞాన జనితమైన మహదానందం'' కావచ్చును. కాని అన్ని వర్గాల వారికి ఆ ఆనందం అందింది. ఇప్పటికీ ఆ జ్ఞాపకాలు నిలిచి ఉన్నాయి. గురజాడ నాటకంలో వాడుక మాటకు పట్టంగట్టి సంగీతాన్ని బహిష్కరించాడు. కన్యాశుల్కం విద్యావంతుల సమాజంలో ఘన విజయం సాధించింది. కాని ఉన్నత వర్గాలవారికి, నిమ్న వర్గాల వారికి ఆ నాటకంలో ఏముందో ఈనాటికీ తెలియదు. సినిమాగా కూడా ఆ నాటకానికి ప్రేక్షకులు మధ్య తరగతి విద్యావంతులే. అన్ని విధాల ఏది సమకాలీనం కాదో అది అట్టడుగు వర్గాల దాకా పోయింది. అన్ని విధాలా ఏది సమకాలీనమో అది పరిమితమైన వర్గాలలో నిలిచిపోయింది. కన్యాశుల్కం ప్రజల

నాటకం కాలేకపోయింది. తెలుగులో సాంఘిక నాటకాలు, పౌరాణిక నాటకాల మాదిరిగా సామాన్య ప్రజల ఆదరానికి నోచుకోలేదు. ఇతర ప్రాంతాలలో ప్రజలు సాంఘికనాటకాలను కూడా ఆదరిస్తారు. దేవల్ తన నాటకంలో సంగీతం చొప్పించడంతో అది ప్రజల్లోకి పోయింది. అది దాదాపుగా ప్రజల నాటకమయింది. ఇతర భాషలలోని కన్యాశుల్కంతో పోల్చదగిన నాటకాలు కూడా, కన్యాశుల్కం కంటె ప్రదర్శన యోగ్యత అధికంగా ఉండడంవలన, అక్కడ నాటకరంగ వికసన వలన ఎక్కువ ప్రచారాన్ని పొందినట్లు తెలుస్తూంది. కన్యాశుల్కం ఒక శ్రీశ్రీ దగ్గరో, ఒక చినవీరభద్రుడు దగ్గరో ఆగిపోకుండా ప్రజల్లోకి సూటిగా చొచ్చుకుని పోగలిగి ఉంటే మన దేశమంతా గర్వించదగిన నాటకం అయి ఉండేది. పూర్ణమ్మ కథ అంత సూటిగా, అందులోని గేయగుణాన్ని గర్భీకరించుకుని ఉంటే ఆ ప్రచారం లభించేది. కన్యాశుల్కానికి - పూర్ణమ్మ కథకు మధ్యలో దేవల్ 'సంగీత శారద' వంటి నాటక సంప్రదాయం ఒకటి ఉంది. దాని ప్రచారాన్ని గుర్తించే - అంటే గేయగుణ ప్రాబల్యాన్ని తెలుసుకునే గురజాడ 'పూర్ణమ్మకథ' ను రాసేడా? సార్వజనిక ప్రచారంలోను, ప్రదర్శన యోగ్యతలోను ఒక మేరకు వెనుకబడినంత మాత్రంతో కన్యాశుల్కం గొప్ప నాటకం కాకపోదు. విద్యావంతులను ప్రభావితం చేస్తే పరోక్షంగా సమాజాన్ని ప్రభావితం చేసినట్లే. ప్రభావితం చేయగల శక్తి కన్యాశుల్కంలో శాశ్వతంగా కనిపిస్తుంది. సార్వకాలీనమైన ప్రయోజనమూ ఆ నాటకంలో ఉంది. అది గొప్ప దృశ్య కావ్యం. ఆధునిక భారతీయ నాటక సాహిత్యంలో ఒక మైలురాయి.

**అథ సూచికలు:**


1. Sisir Kumar Das, "A History of Indian Literature 1800-1910", Vol. III, Sahitya Academi, 1991, P. 188.
2. Ibid, P. 184
3. ఆధునిక గద్య వాఙ్మయ ప్రవర్తకుడు, ''మన గురజాడ'', శ్రీశ్రీ, విరసం ప్రచురణ, 1988, P. 50 - 51.
4. కన్యాశుల్కంలో లోపాలు, పు. 47 ''మన గురజాడ'', శ్రీశ్రీ, విరసం ప్రచురణ, 1988.
5. కన్యాశుల్కం మీద, పు. 36 ''మన గురజాడ'', శ్రీశ్రీ, విరసం ప్రచురణ, 1988.
6. ఒక కావ్య నాయిక, పు. 42 ''మన గురజాడ'', శ్రీశ్రీ, విరసం ప్రచురణ, 1988.
7. ''ఏది మంచి? ఏది చెడు?'' - సహృదయునికి ప్రేమలేఖ, చినవీరభద్రుడు, ఎమెస్కో ప్రచురణ, 2001 జనవరి, పు. 54.
8. ''మద్రాసు హైకోర్టువారి ఇటీవలి తీర్పు సమాజ సంస్కరణోద్యమానికి గట్టి చేయూత నిచ్చింది. ప్రధాన న్యాయమూర్తి, సర్ ఆర్నల్డ్ వైట్, న్యాయమూర్తులు మిల్లర్, మన్రోలు గల ఒక పుల్‌బెంచి ఈ తీర్పులో ఇలా నిర్దేశించింది. ''తన కూతురునిచ్చి పెళ్లి చేసినందుకుగాను తండ్రికి కొంత డబ్బు చెల్లిస్తానన్న ఒప్పందం కుదుర్చుకోవడం నీతిబాహ్యమైనది; ఇండియన్ కాంట్రాక్టు చట్టంలోని 23వ సెక్షన్ తాత్పర్యాన్ని బట్టి, ప్రభుత్వ విధానానికి విరుద్ధం'' కన్యాశుల్కం, రెండవ కూర్పు పీఠిక. సంపాదకుడు : సెట్టి ఈశ్వరరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. 1986 సెప్టెంబరు. P - XVI.
9. "Modern life which presents complex social conditions is neglected by play - wrights" కన్యాశుల్కం, preface to the second edition.

10. "Hammerer characterization and the construction of an original and complex plot have been attempted". కన్యాశుల్కం, preface to the first edition.
11. Encyclopaedia of Indian Literature, Vol. I, Sahitya Academi, P. 899.
12. "Dutta was most individualistic and independent as an author and preoccupied himself with larger questions of human existence" - Pavitra Sarkar, Comparitive Indian Literature, Vol. I, Director & Chief Editor, K.M. George, Kerala Sahitya Academi & Macmilan India Limited, 1984, P. 485.
13. "The Elements of Drama", J.L. Satyam, Cambridge University Press, 1960, P. 75
14. Literature and Society in Assam, Prof. Tilottama Misra, Onsons Publications, Guwahati, 1987.
15. Encyclopaedia of Indian Literature, Vol. I, Sahitya Academi, P. 897.
16. Farce, Dictionary of English Literature, By Homer A. Watt and william, W. Watt, New Yark, Barnel & Noble, IN.e. 1947.
17. Farce, Dictionary of English Literature, By Homer A. Watt and william, W. Watt, New Yark, Barnel & Noble, IN.e. 1947.
18. Restoration Drama, By Homer A Watt and William, W. Watt, New York, Barnel & Noble, IN.e. 1947.
19. Modern Indian Literature - An Anthology, Vol. III Plays and Prose, General Introduction, Sahitya Academi, 1994, P. 11.
20. Comparitive Indian Literature, Vol. I. P. 545.
21. "His only original contribution to the Marathi Theatre was Sharada (1899)" - Encyclopaedia of Indian Literature, Vol. I, Sahitya Academi, P. 938.
22. A History of Indian Literature 1800-1910, Vol. III, Sisir Kumar Das, Sahitya Academi, 1991, P. 280.
23. Encyclopaedia of Indian Literature, Vol. I, P. 938.
24. Modern Indian Literature - An Anthology, Vol. III, Plays & Prose, P. 442.
25. A History of Indian Literature 1800-1910. Vol. III, Sisir Kumar Das, P. 194.
26. Comparitive Indian Literature, Vol. I, Director & Chief Editor, K.M. George, 1984, Kerala Sahitya Academi & Macmilan India Limited, P. 518.
27. A History of Indian Literature, 1800 - 1910, Vol. III, Sisir Kumar Das, Sahitya Academi, P. 279.
28. Comparitive Indian Literature, Vol. II, 1985.
29. గురజాడ - ఆంగ్లమూలం: నార్లవెంకటేశ్వరరావు, తెలుగు అనువాదం: కేతు విశ్వనాథరెడ్డి, సాహిత్య అకాడమీ, పు. 46.
30. i) Chambers Cyclopaedia of English Literature, David Patrick, LLD. Vol. II, London And Edinburgh, W&R Chambers Limited 1903, P. 637.
    ii) The Concise Cambridge History of English Literature, By George Sampson, Cambridge, At the University Press, 1953, P. 417.
    iii) Brewers Theater, A Phrase and Fable Dictionary, A Casell Book 1994.
31. British Authors of the Nineteenth Century, Edited by Stanly J. Kunitz, New York, The H.W. Wilson Company. 1936, P. 523.
32. Comparitive Indian Literature, Vol. I, Introduction.

(సమాప్తం)

# కవిత్వంగా సైన్స్

– నాగసూరి వేణుగోపాల్

కొన్ని ఆలోచనలు బుర్రలో గిరికీలు కొడుతూనే వుంటాయి, మెదడును తొలుస్తూనే వుంటాయి. అక్టోబరు మొదటి వారంలో 'కరంట్ సైన్స్' జర్నల్ అందగానే - అందులో పడిన ఒక ప్రకటన ఎంతో ఆనందం కల్గించింది. అరపేజి వుండే ఆ ప్రకటన శీర్షిక - Poetry in Science. ఈ విషయం చూడగానే ఎందుకంత ఆనందం కల్గింది? ఎందుకీ వ్యాసం రాయించింది?

పొయిట్రీకీ, సైన్స్‌కూ చుక్కెదురని చాలా బలంగా నాటుకుపోయిన అభిప్రాయం. ఎందుకు? పొయిట్రీ అంటే కల్పనా జగత్తు అనీ, సైన్స్ అంటే 'డ్రై' అంశాలు అనా? సైన్స్, సాహిత్యం రెండు సంస్కృతులనీ, వాటికి వారధి అవసరమని సి.పి. స్నో లాంటి వారు ఎంతగా వాదించలేదు. ఈ విషయం గురించి 'సాహిత్య తత్వము - శివ భారత దర్శనము' గ్రంథంలో డా. సర్దేశాయి తిరుమలరావు సుదీర్ఘమైన ఉపోద్ఘాతంగా చాలా వివరించారు. తిరుమలరావుగారి ఆయిల్ టెక్నాలజిలో ప్రపంచ స్థాయిగల రసాయన శాస్త్ర వేత్త. అనంతపురంలోని 'ఆయిల్ టెక్నాలజి రీసర్చి ఇన్స్టిట్యూట్ (OTRI) డైరెక్టరుగా పనిచేసి కొన్ని సంవత్సరాల క్రితం మరణించారు.' 'కన్యాశుల్కం' మీద; శివ భారతం మీద సాధికార విమర్శనా గ్రంథాలు రాశారు. రెండు రంగాలలో విశేషకృషి చేశాడు గనుకనే వారి అభిప్రాయాన్ని యిక్కడ పేర్కొనడం.' రెండు అఖాతముల మధ్య వారధి నిర్మించవలెను' - ఆయన అనేవారు. సైన్స్ క్లిష్టమనీ, తమకు పొసగదనీ సాహిత్యకారులనుకుంటే - సాహిత్యం తమది కాదని సైన్స్ తెలిసిన వారనుకుంటూ వుంటారు. కానీ 'పరాకాష్ట' అనదగ్గ యింటెలిజెన్స్ ఈ తేడాలను ఖాతరు చేయదనడానికి కవిత్వ హృదయం గల పెద్ద శాస్త్రవేత్తలను చూపవచ్చు. ఉదాహరణకు సి. వి. రామన్‌గారి ఈ అభిప్రాయం చూడండి-'' వైజ్ఞానికుడు ప్రకృతి యొక్క విద్యార్థి. అతడు ప్రకృతి నుండి స్ఫురణను పొందగలడు. గంభీరమైన ఆలోచనా శక్తిని సాధనగా చేసుకుని, దాని తాలూకు చిత్రాలను అతడు తన మస్తిష్కములో చిత్రిస్తాడు, లేదా సృష్టిస్తాడు. ఈ క్రియలో వైజ్ఞానికుడు యితర కళా సాధకుల వలెనే - తానుగా ఏర్పరచుకొన్న తర్కం అనే నియమంతో తనను బంధించుకొంటాడు. సహజ ప్రకృతికి ప్రతి కృతులను గావించే ఈ కృషిలో మానవుని సౌందర్యాత్మక, బౌద్ధిక భావనల ఏకీకరణమే విజ్ఞానం. అందుకే విజ్ఞానం అత్యుత్తమమైన సృజనాత్మక కళా స్వరూపము''. తెలుగు విషయానికి వస్తే యిటు వంటి ఆలోచన తక్కువనే చెప్పాలి. మహీధర నళినీ మోహన్ చక్కని సాహితీ కారుడయినా, కొడవటి గంటి కుటుంబరావు సైన్స్‌కు సంబంధించి చాలా విషయాలు రాసినా - యిటువంటి ప్రయత్నం తక్కువే సాగింది. సైన్స్‌ను పద్యాలలో రాయాలని వసంతరావు వెంకటరావు చేసిన కృషిని నళినీ మోహన్ 'అనవసర ప్రయాస'గా తెలుగు అకాడమి ద్విదశాబ్ది సంచికలో అంటాడు. నిజానికి ఈ ఆలోచనను సీరియస్‌గా తీసుకోలేదేమో! 'మెదడు తొలచినప్పుడు వ్యాసాలు అపుడప్పుడు వస్తున్నాయి అంతే'. ఇటీవల డ్యాక్టర్ చందూ సుబ్బారావుగారి 'సాహిత్యమూ - సైన్సూ' పుస్తకం వెలువడింది. అది మరో రకం చర్చకు కారణమయ్యింది గానీ - ఇటు ప్రేరేపించిన ఉదాహరణలు కనబడలేదు. కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణగారు 'అక్షరంలో అంతరిక్షం' అనే కవితా సంకలం వెలువరించి - సైన్స్ కవితలు అన్నారు. దీని మీదకూడా ఈ కోణంలో చర్చ జరుగలేదు, ప్రయత్నం సాగలేదు.

ఇటీవల విజయవాడ ఆకాశవాణి దక్షిణాంధ్ర కోస్తా జిల్లాల్లో HIV/AIDS అవగాహన కోసం ప్రత్యేక కార్యక్రమాలు రూపొందిస్తోంది. ప్రస్తుతం దేశంలో 0.7 శాతం మంది ఈ యిన్ఫెక్షన్‌కు

నాగసూరి వేణుగోపాల్, ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్, ఆకాశవాణి, విజయవాడ.

గురయ్యారనీ, 1.0 శాతం అయితే దాన్ని ఎపిడమిక్‌గా పరిగణిస్తారని తెలుస్తోంది. రాష్ట్రంలో మూడున్నర లక్షల మందికి పైగా ఈ యిన్ఫెక్షన్‌తో వున్నారని అధికారిక లెక్కలు చెబుతున్నాయి. ఇది దేశంలో (మహారాష్ట్ర తర్వాత) రెండవ స్థానం. దక్షిణాంధ్ర, కోస్తా జిల్లా - గుంటూరు, కృష్ణలు, ఉభయ గోదావరి...... లలో సమస్య తీవ్రంగా వుందని స్పష్టమవుతోంది. మనిషిలోని 'లోమనిషి' లైంగికంగా బయట పడతాడు. లైంగికంగా ప్రేరేపించబడిన వాడి వ్యూహం లోపలికి వెడితేనే అర్థమవుతుంది. అందువల్ల ఎవరికి వుందో, ఎవరికి లేదో తెలియని పరిస్థితి యిది. నడిరోడ్డులోని ఈ కార్చిచ్చు - చాపకింద నీరు లాగా కనబడటం లేదు. వాస్తవ వివరాల్లోకి వెడితే గుండె ఆగినంత పని అయిపోతుంది. వీటిని తెలుసుకుంటే - అదేదో జానపద కథలో మహా రాజుకి 'నిత్య యవ్వనం కల్గించే ఫలాన్ని' ఒక ఋషి ప్రసాదిస్తే - ఆయనగారు తనకిష్టమైన ప్రియురాలికిచ్చాడట. ..... ఆవిడ తన యిష్టమైన ప్రియుడికిచ్చిందట. ఆయనగారు.... చివరికి ఆ పండు రాజు గారికే చేరిందట. ఇలా వుంది ప్రస్తుత పరిస్థితి. నేడు చికిత్సలేని ఎయిడ్స్ రావడం వల్ల యిది కొంత గోచరమవుతోంది. లేక పోతే ఈ ముసుగు తొలగించే వారెవరు?

లైంగిక వాంఛలను అదుపు చేసుకోలేక పోవడం మనిషి నైజం అయితే - కామ సూత్రాల సాహిత్యం వున్న సైన్స్ గురించి మాట్లాడం ఈ దేశంలో పాపం. వెరసి హెచ్.ఐ.వి. వికృత రూపానికి ఆజ్యం పోస్తున్నాయి. మనిషి అకస్మాత్తుగా అంతర్థానమయినట్లు ఈ వ్యధితో దృశ్యం మారుతుంది. ఒక్కసారిగా సంపాదన శూన్యమవుతుంది. అన్ని రకాల వివక్షమొదలవుతుంది. ఒకచోట హెచ్.ఐ.వి. రోగిని రాళ్ళతో కొడితే, మరోచోట గదిలో బంధించి వేశారు. మరోచోట ఎయిడ్స్‌తో మరణించిన వ్యక్తికి అంత్యక్రియలు జరపడానికి ఊరంతా - బంధువులంతా దూరమైతే - జోరునపడే వర్షంలో అతని భార్య అంత్యక్రియలు నిర్వహించింది. అలాగే మరోచోట ఈ వ్యాధిసోకిన భార్యాభర్తలు ఆత్మహత్య చేసుకున్నారు. అవగాహనా రాహిత్యంతో వారి మరణాన్ని మనం ముందుగానే ఆహ్వానిస్తున్నాం. నేడు హెచ్.ఐ.వి.కి విరుగుడు లేకపోవచ్చు, కానీ దానితో సహజీవనం చేయవచ్చు. మధుమేహం, రక్త పీడనం లాగా దీన్ని కూడా మందులతో కంట్రోల్ చేసుకుంటూ జీవితం సాగించవచ్చు. నిజానికి హెచ్.ఐ.వి. రోగులను వివాహం చేసుకున్న హెచ్.ఐ.వి. రోగులు వున్నారు. అంతే కాదు 'టైమ్స్ ఆఫ్ ఇండియా' ఈ మధ్య ఓ మంచి వార్త ప్రచురించింది. ఢిల్లీ, బొంబాయి, కలకత్తా నగరాలలో ఆరోగ్యంగా వున్న ముగ్గురు మహిళలు తెలిసి, కావాలని హెచ్.ఐ.వి. రోగులను వివాహం చేసుకున్నారు. ఇది నిజమైన 'పాజిటివ్ మేరేజి' అని ఆ పత్రిక వార్తగా రాసింది. ఈ విషయంలో యిటువంటి వాస్తవ గాథలు ఎంతో లోతుగా వుంటున్నాయి.

ఏ వ్యాధికి లేనంత రీతిలో మానవ భావావేశాలు ముడి పడివున్నాయి. సాహిత్య కారులు ఈ విషయం గురించి ఆలోచించాల్సిన అవసరముందనిపించింది. దీనికి కవులు ఎలా స్పందిస్తారని ఆలోచన కల్గింది. దాంతో ఒంగోలు, తణుకు పట్టణాలలో కవులతో వైద్యుల ముఖాముఖిని ఆకాశవాణి ఏర్పాటు చేసింది. వర్థమాన కవులతో పాటు లబ్ధ ప్రతిష్ఠులయిన కవులు డా. యన్. శైలజ, కొప్పర్తి, రసరాజు, బి.వి.వి. ప్రసాద్ లాంటివారు ఈ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. వర్క్‌షాపులాంటి ఈ కార్యక్రమంలో HIV/AIDSకు సంబంధించి సమాచారం, సరైన అవగాహన కల్గించడానికి ప్రయత్నం జరిగింది. దీనితో స్ఫూర్తి పొంది- కవిత్వం రాయడానికి ప్రయత్నం మొదలైంది. ఎక్కడ సైన్స్ ఎంత వుండాలి? ఏ పాయింట్ దగ్గర కల్పన రెక్కలు సాచి విజృంభించాలి? దీని పరిధి ఎంత? అని కూడ చర్చ సాగాలి. సరిగ్గా ఈ సమయంలో 'కరంట్ సైన్స్' (25-9-01.)లో ప్రకటన రావడం చాలా ఆనందం కల్గించింది. ఆంగ్లంతో పాటు ప్రముఖ భారతీయ భాషల్లో ఈ కవిత్వం రాయవచ్చని ఆహ్వానం

ఋది. బహుమతులుంటాయని కూడా ప్రకటించారు. (ఆ ప్రకటనను ఇక్కడ పొందు పరుస్తున్నాం) 'కరంట్ సైన్స్' జర్నల్‌కూ, డా. డి. బాలసుబ్రమణియం గారికి అభినందనలు.

# Poetry in Science

**An invitation to readers to verse and win prizes**

In recent times, there has been some discussion on the use and relevance of poetry in science. It has been argued that scientists can be and are poets, and that they may provide language and perspectives that are interestingly different from the general populace of poets. The modern poet Gregory Corso has said: 'I love poetry because it makes me love and presents me life... it does tell me soul has a shadow'. We have also been reminded of the poetic abilities of the naturalist Erasmus Darwin, and how he poetically expressed his ideas on biological evolution in rhyming couplets. For example :

'Organic life beneath the shoreless waves
Was born and nurs'd in Ocean's pearly caves
First forms minute, unseen by spheric glass
Move on the mud, or pierce the watery mass'.

*New Scientist* asked it readers several years ago to write on science in the Japanese poetic form called Haiku. 'This form, practised by Zen philosophers to express lofty and philosophical thought in a succinct form, is a poem of three lines. The first line has five syllables, the second seven and the third line again has five syllables. The prize - winner wrote :

'Galileo said
That the earth moves round the Sun
While the church stood still'.

When I ventured to launch a similar Haikū competition in science in Hyderabad six years ago. I found that the 'biology lot, bent their neurons to the hilt, but it came to nought', I am emboldened to throw the challenge afresh to the readers of *Current Science* now, particularly in light of e-mail attachments that are doing the rounds about computer error messages written in Haiku form. Here is a couple: 'Chaos reigns within; Reflect, repent and reboot; Order shall return', and 'Three things are certain; Death, taxes and lost data; Guess which has occured'.

Here then is my challenge. I invite readers to submit their thoughts on matters connected with science in the form of poetry. The style is open; as rhyming couplets, Haiku, sonnets, limericks...., but please try and avoid free verse! While I prefer it to be in English, I encourage submissions in major Indian languages as well. We shall have a jury to judge the poems and award prizes. The jury - chosen poems will also be published in *Current Science.* Please send your entries to Poetry Competition, c/o The Editor, *Current Science,* Post Box No. 8001, C.V. Raman Avenue, Bangalore 560 080.

The last date for sending in entries is 5 November 2001.

D.Balasubramanian, Competition Coordinator, L.V. Prasad Eye Institute, Hyderabad - 500 034, India.

దీనికోసం కవిత్వం పంపడానికి చివరి తేది నవంబరు 15. మీ కవిత్వం 'కరెంట్ సైన్స్'కూ, చర్చా వ్యాసాలు 'మిసిమి'కి పంపగలరు!

# గ్రంథ సమీక్ష అను ఓ భయప్రకటన !

– నరేష్ నున్నా

ఈ మధ్య చిక్కడపల్లి గల్లీలో వెళ్తుంటే సౌదా కన్పించాడు. ఎప్పటిలానే కోవర్ట్ నవ్వులు రువ్వుతూ, పొట్టిగా, గుండ్రంగా, అమాయకంగా, ఏమెరగనట్టుండే అతనిని చూస్తుంటే, దట్టించిన డైనమైట్‌ని నడుంకి కట్టుకున్న ఆత్మాహుతి దళ సభ్యుడ్ని చూసినట్టు నాకు వెన్నులోంచి పుడుతుంది ఒణుకు. అయితే, ఒక భరోసా ఏమంటే, అత్యంత వినాశకరమైన పేలుడు పదార్థాలని తన పెన్నులో కూర్చుకున్నాడని రాజ్యాని (state)కి ఉప్పందించగల shrewd ఇన్ఫార్మర్లు లేవట్టే, ఆ విషయాన్ని అర్థం చేసుకోగల తెలుగు సాహిత్య మిత్రులు కూడా దాదాపు లేరు (ఈ మాటకు సౌదా అశేష అభిమాన వాహిని ఆగ్రహం కట్టలు తెగొచ్చు. కానీ, 'కృష్ణశాస్త్రి ఆరాధకుల్లో చాలా మంది అతని కవిత్వం చదవని వాళ్ళూ, చదవినా అర్థం కాని వాళ్ళూ' అని చలం గారన్న మాటల్ని నేను సౌదా అభిమానులకి అన్వయించేందుకు సాహసిస్తున్నాను).

భయం భయంగానే పలకరించాను. రాజారామోహన రాయ్ ఫౌండేషన్, కోల్‌కత్తా వారు తన 'అపూర్వ పురాణ కథల్ని' 1000 కాపీల వరకూ తీసుకుంటున్నారని, దాని వల్ల ముద్రణా రుణ విముక్తుడ్ని కాగలనని చెప్పాడు - కొంచెం సంతోషంగా. ఆ బెంగాలీ బాబుల కెందుకీ తెలుగు కథలని అనుకుంటూ అడిగాను. ఆంధ్రదేశంలో గ్రంథాలయాలకి వారి ఫౌండేషన్ తరపున బహుమతిగా పంచుతారని చెప్పడంతో మరోసారి భయంతో బిగుసుకుపోయాను.

★ ★ ★ ★

నా భయానికి కారణాలు చెప్పుకునే ముందు, నేనెవరో చెప్పుకోవడం అవసరం (సందర్భోచితం కూడా): తన కంట్లో నలుసు పడితే, ప్రపంచం కన్నూ ఎర్రబడాలని ఆశించే, తన కాలికి ముల్లు గుచ్చుకుంటే దేశం విలవిలలాడదేమని ఆశ్చర్య పోయే, తన మోదప్రమోదాలే ఆంధ్రదేశానికి శిరోధార్యాలని అనుకునే... కోస్తా ఆంధ్రలో పుట్టిన వాడిని. ఉభయ గోదావరుల ఇంగువ వాసనలతో, మూఢాచారపు మురికిలో, జంధ్యాల సాలెగూట్లో ఇరుక్కుపోతుంటే, రేపటి ప్రపంచం లోకి 'కదం తొక్కుతూ, పదం పాడుతూ, హృదయాంతరాళం గర్జిస్తూ' నడిచామని, నడుస్తున్నామని సుమారు రెండు శతాబ్దాలుగా భావిస్తున్న తెనాలి కేంద్రిత కృష్ణా, గుంటూరు జిల్లాల చైతన్యమే ఉగ్గుబాలుగా పెరిగిన వాడిని 'All convergent influences of the world run through this society: Hindu, Muslim, Christian, Secular, Stalinist, liberal, Maoist, democratic, sociolist, Gandhian. There is not a thought that is being thought in the West or East that's not active in some Indian mind.' అని భారత దేశాన్ని గురించి వ్యాఖ్యానించిన ఇ.పి. థామ్సన్ అనే పెద్దమనిషి, బహుశా ఈ రెండు జిల్లాలలోనే భారతదేశ చైతన్యాత్మని సందర్శించి వ్యాఖ్యానించాడేమోనని తోచేలా చేసిన నేలకు వారసుడ్ని. తొమ్మిది నిండునెలల ప్రసవ యాతనని సినిమా పాటలోలా తొమ్మిది నిమిషాల లోపే భరించి (తమ వర్గా / వర్ణానికి) కావలసిన ఫలితాల (ఫలాల)ను రాబట్టుకున్న విప్లవస్ఫూర్తికి సాక్షిని. వ్యాసుడు, వాల్మీకీ, మహావీరుడు, బుద్ధుడు, చార్వాకుడు, అశ్వఘోషుడు, శంకరుడు, బసవడు, బ్రహ్మనాయుడు (ఈ జాబితా అనంతం....) ఇత్యాదులు అభినవ రూపాల్లో మళ్ళీ మళ్ళీ పుట్టిన మట్టిలో ఒకగడ్డని. అపరవేదాలు, ప్రత్యుపనిషత్తులు,

---

నరేష్ నున్నా, విశాఖపట్టణం, ఆంధ్రప్రభ డైలీలో ఎడిటోరియల్ బోర్డులో పనిచేస్తున్నారు.

సమాంతర పురాణాలు, నవీన ఇతిహాసాలు పుంఖానుపుంఖమై, వ్యాఖ్యలు, ఉపవ్యాఖ్యలు, వాదోపవాదాలు, సంకుల సమరాలు అసంఖ్యాకమైన సీమకు ఒకానొక బిడ్డని.

అటువంటి నాకు, ప్రత్యామ్నాయ సంస్కృతి ప్రతిష్ఠాపక ప్రయత్నాలంటే అట్టే లక్ష్యం, భయం లేవు (రెండు శతాబ్దాల అనుభవాలే హామీగా). అధిక సంఖ్యాక, marginalised ప్రజల బహుముఖీనతకి పట్టం గట్టి, వారిని one among the equalsగా, first among the equalsగా చేసే ప్రయత్నం ఏ ఉద్యమం చేయ లేదు / చేయదు. భారతదేశంలో resurgent గా పేరొందిన ఏ ముక్క తీసుకున్నా ఇదే హామీ. ఇది ఉద్యమ సారథుల వ్యూహమో, పరిమితో తేల్చి చెప్పడం కష్టం / కష్టం కాదు కూడానూ. ఆంధ్రదేశానికి సంబంధించి ('మా జిల్లాల ద్వయమే భారతదేశం పెట్టు' అన్న వాడిని, గుప్పెడు ఆంధ్రదేశాన్ని మా నేలకు నామాంతరంగా ఉపయోగిస్తే మీరు ఆగ్రహిస్తారనుకుంటానా?) సాహిత్య రంగానికి నా domainని కుందించుకుంటే, ప్రత్యామ్నాయ సంస్కృతి ప్రతిష్ఠాపన విషయంలో త్రిపురనేని రామస్వామి, నార్ల వేంకటేశ్వర రావు గార్లదే గట్టి contribution అని నా ఉద్దేశం (పురాణాల్ని, ప్రతివ్రత గాథల్ని ఎన్నింటినో తన ఆవరణలోకి తిరగరాసిని చలంగారిక్కడ contextualగా మినహాయింపు).

అయితే, త్రిపురనేని, నార్ల రచనల motifని ఒక్క మాటలో కుదించుకొని చెబితే, అది 'ప్రతీకారేచ్ఛ'! సత్యాన్వేషణ (సత్యప్రకటన) లక్ష్యంగా రిఫరీ పాత్ర పోషించవలసిన రచయిత, ఒక టీములో చేరిపోవడం వంటిదది. విజేతల గురించి విజేతలే రాసుకోవడం చరిత్ర. విజితల గురించి విజేతలు (అరుదుగా) రాసిన దశలో ప్రస్ఫుటంగా కనిపించిన లోపాలు, రచయితల పరిమితుల్ని దృష్టిలో పెట్టుకోవలసిన బాధ్యత మూడో దశ రచయితలకు ఉంది. వారు విజితల వర్గానికి చెందిన వారు. విజితలు తమ గురించి తామే రాసుకునే అద్భుత సందర్భమది. అయితే, త్రిపురనేని, నార్ల దానినొక encounter కిందే భావించారు. ఒక విధంగా చెప్పాలంటే వారి అధ్యయనం, అనుభవం, యాతన, తపన, శ్రమ, అకుంఠిత దీక్ష అన్నింటినీ అతిసునాయాసంగా రద్దు చేయడానికి వారి చేజేతులా ప్రత్యర్థులకు అవకాశం ఇచ్చారు. త్రిపురనేని - 'సూతపురాణం', 'ఉత్తర రామచరితం', 'ఖూనీ'; నార్ల - 'సీతజోస్యం', 'జాబాలి', 'హిరణ్యకశిప వధ', 'నరకంలో హరిశ్చంద్రుడు'... ఇత్యాదులు ఎగిసి విరిగే సముద్ర కెరటాలై తీరాన్ని ఆక్రమించలేక, తాకడంతో సరిపుచ్చుకొని తగ్గవలసి వచ్చింది. Litarary textకి మూడింతలు పీఠికల పేరిట రాయడం ద్వారా, ఆ సాహితీ పాఠాలను పీఠికల ఊతకర్రలతో నిలపాలని ప్రయత్నించినట్లై, ఏ కాస్త జరిగిన చర్చ అయినా, అది ఆ పీఠికలకు, ఆ పీఠికలు రాయడానికి వారు ఖర్చు చేసిన ఘర్మ జలానికి సంబంధించిందే అయింది.

అధికారం రాజకీయంగా, సామాజికంగా చేతులు మారింది. సాహిత్యం తదనుగుణంగా రంగు మార్చుకుంది. స్థానీయ, దేశీయ, జాతీయతల్ని మీరి, దృష్టి - అంతర్జాతీయంగా 'విశాల' మయింది దశాబ్దాలు కాళ్ళీడ్చుకుంటూ కదిలింది కాలం. ఇంతలో ఎక్కడో మళ్ళీ ఓ గణాచారి 'ప్రత్యామ్నాయ సంస్కృతి' అన్నాడు. 'పోస్ట్ మోడ్రనిజం' అనీ, 'దళితీకరణ' అని... మరి కొన్ని పాలికేకలు శ్రుతి కలిశాయి. 30 ఏళ్ల గుజరాతీ సాహిత్య వేదనకు, 4 దశాబ్దాల మరాఠీ సాంస్కృతిక యాతనకు ప్రతిబింబంగా తెలుగు దళిత సినిమా పాట కొత్తగా మొదలయింది. నిమిషాల్లోనే అయిపోయింది.

ఈ పాటలో తెలుగు దళిత చైతన్యం చూడని పార్శ్వాలు, చూపించని కోణాలు, ఒడిసిపట్టని గాథలు, ఆవిష్కరించని యథార్థ జీవితాలు లేవు. శ్రీకృష్ణ భగవానుడు యశోదమ్మకి నోరు తెరిచి సమస్త లోకాల్నీ చూపించినట్టు, దళిత కవిత్వం / కథ/ నవల/ నాటకం; దళిత సానుభూతి కవిత్వం / కథ/ నవల/ నాటకం; దళిత ఆత్మ గౌరవ కవిత్వం / కథ/ నవల / నాటకం; దళిత ప్రతీకార కవిత్వం / కథ/ నవల/ నాటకం; దళిత పశ్చాత్తాప కవిత్వం / కథ/ నవల/ నాటకం; దళిత సంఘీభావ కవిత్వం / కథ / నవల / నాటకం; దళిత ఆత్మ పరిశీలక కవిత్వం / కథ / నవల/ నాటకం; దళిత మైనారిటీ ఆగ్రహ కవిత్వం / కథ / నవల / నాటకం; దళిత తెలంగాణ / రాయలసీమ / కోస్తా ఆంధ్ర కవిత్వం / కథ / నవల / నాటకం; దళిత స్త్రీవాద కవిత్వం / కథ / నవల / నాటకా........అన్నింటిని ఆంధ్ర దళిత రచయిత, పాఠకుడికి చూపించేశాడు.

ఇటువంటి నిరపాయ, నిర్భయ, నిశ్చిత స్థితిలో కాలం నడుస్తుండగా, సౌదా తన 'అపూర్వ కథ' ల్ని పుస్తక రూపంలో బైటకు తెచ్చాడు. చదివాను; భయమేసింది. అయితే, పురాణ గ్రంథమాల వాళ్ళ పాత కంపుకొట్టే కెంపురంగు బౌండ్ అట్టల మధ్య అచ్చొత్తిన ఈ పుస్తకానికి 240 ( అక్షరాల రెండొందల నలభై) రూపాయలు ఖరీదుగా నిర్ణయించడంతో కొంచెం ఊపిరి పీల్చుకున్నాను. దిన పత్రిక రేటు రూపాయికి పడదోసినా, పక్కవాడి పేపరు మీద ఒరిగిపోయే తెలుగు పాఠకులు, అంతలేసి డబ్బులు పోసి కథల బుక్కు చదివే అవకాశం లేదన్న భరోసా. ఉచితంగా పుస్తకం కాపీ సంపాదించి చదివే తెలుగు రచయితల స్థాయి, ఆలోచనల పెళుసుదనం, ఈర్ష్యాసూయల పరిమాణం, ప్రిజుడీస్ దృఢత్వం వగైరాలు తెలుసు కనుక నిశ్చింతగా ఉండిపోయాను.

కానీ, ఇప్పుడు ఈ బెంగాలీ సమితి వాళ్లెవరో అలా ఆంధ్ర దేశం నలుమూలలకీ పంపిణీ చేయబోతున్నట్టు తెలిసినప్పటి నుంచి మళ్ళీ భయం ముంచుకొస్తోంది.

నేనెవరో చెప్పి, నా భయం ముందు వెనకలు చెప్పి, భయానికి కారణాలు చెప్పకపోతే అసంపూర్ణమవుతుంది. కనుక నాయీ భయప్రకటనను అర్థాంతరంగా ఆపకుండా చేసే ప్రయత్నంలో భాగంగా 'అపూర్వ పురాణ కథలు' నాకెలా అర్థమయ్యాయో చెప్పుకుంటాను.

★ ★ ★ ★

భరతవర్షంలోనే కాదు, ఎక్కడైనా మానవ పరిణామ చరిత్రకి మూలం మానవ సమూహాల మధ్య ఘర్షణే. అధికారం, ఆధిపత్యం కోసం జరిగిన ఘర్షణ కొందరిని విజేతలుగా, కొందరిని విజితలుగా చేసింది. అయితే, ఈ దేశానికే చెందిన ఒక ప్రత్యేకత ఏమంటే, దాదాపు 5వేల ఏళ్ళుగా విజేతలు, విజితల స్థానాలలో చెప్పుకోదగ్గ సామాజిక చలనం లేకపోవడమే. 'ఎక్కడ ఉంచాల్సిన వాళ్లని అక్కడే ఉంచాల'న్న భావాన్ని తారతమ్య రహితంగా విజితలు కూడా అంగీకరించి, ఆమోదించి, శిరసావహించేలా చేసిన విలక్షణత మన దేశానికే సొంతం. జాతిరక్తంలో తారకమంత్రమై కలిసిపోయిన ఆ భావం - 'కులం' అనే నామాంతరంతో అజరామరమయింది.

ఇదిలా ఉంటే, అసలు విజేతలు/ విజితలు అన్న మౌలిక విభజనతోనే పేచీ పడ్డాడు సౌదా. విజేతలు నిజంగానే గెలిచారా? అని ప్రశ్నించాడు. అవకాశం వస్తే తమది పై చేయి కావాలని ఒడిపోయిన వారు

నిజంగానే కాచుకొని ఉన్నారా? అని తర్కించాడు. సోదాహరణంగా చేసిన తర్కమిది. హిరణ్యాధ్వనుడు పరాజిత(?) వర్గానికి చెందిన ఒకానొక ఎరుకల రాజు. అతడి రాజ్యం మీదికి యెందరు దండెత్తినా వొక్కసారి కూడా వొక్క బాణపు గాయం కూడా తగల కుండా తరిమికొట్టిన వీరుడతడు. యెందరో రాజులు హిరణ్యాధ్వనుడిని జయించలేక భంగపడి సయోధ్య చేసుకుని కనీసం తమకు సాయపడినా చాలని అర్థించుకున్నారు. వారి విన్నపాలను చిరునవ్వుతో సరి పెట్టాడు మహారాజు. నాగరిక రాజ్యాన్ని జయించడం అతడికి చిటికెలో పని. కానీ యుద్ధం విజయాన్ని కోరుతుంది. కనుక యుద్ధం వీరుడి పని కాదు. యుద్ధం వెంట పడకపోవడమే వీరుడి కర్తవ్యం. యుద్ధం మన ముంగిటికి వొచ్చినప్పుడు తరిమికొట్టాలి. తరుముతూ దాని వెంట పడి పోకూడదు. పారిపోయిన యుద్ధాన్ని తిరిగి పిలవకూడదు అనేది హిరణ్యాధ్వనుడి మతం. ప్రజలందరూ అలవిగాని విలుకాళ్ళే అయినా వీరులుగా ఉండటమే వారికిష్టం. కవ్వింపులెదురైనా కదనానికి కాలు దువ్వరు.

హిరణ్యాధ్వనుడి యుగానికి మరో యుగం ముందటి వాడు వాలి. యుద్ధమెప్పుడూ ద్వంద్వయుద్ధమే కావాలన్నది నాటి 'అనాగరికుల' యుద్ధనీతి. ఆయుధాల సృజన ఆయా జాతుల 'నాగరికత' కు ఒక ప్రమాణం. వాలీ, సుగ్రీవుల వంటి మూల వాసీ భూమి పుత్రులకు విల్లుతో యుద్ధమే అధర్మం. అదీనూ చెట్టు చాటు నుండి బాణాన్ని వేయడం ద్వారా అధర్మానికిపాల్పడి వాలిని రాముడు చంపాడన్న సత్యాన్ని (రాముడి పక్షాన నిలిచినప్పటికీ) వాల్మీకి మహాకవి దాచలేదు. అయితే, వాలీ, సుగ్రీవులలో రాముడు బలహీనుడైన సుగ్రీవ పక్షం వహించడంలో ఉన్న మర్మాన్ని విప్పి చెప్పడం ద్వారా సౌదా మరో అడుగు ముందుకు వేశాడు... వాలి సజీవుడై ఉన్నచో నా వునికికి అర్థం లేదు. ధర్మాధర్మ విచక్షణజ్ఞానం చేతనే కదా యిట్టి ధర్మ చింతన చేయగలిగిన శక్తి మానవునికి అబ్బినది అనుకున్న శ్రీరాముడు నిజంగానే 'విజేత' వర్గీయుడా అన్నది సౌదా ప్రశ్న.

అలానే, కడజాతి కన్య జబాలతో సంబంధం పెట్టుకొని, 'వర్ణాశ్రమ ధర్మ' విరుద్ధంగా రహస్య సంతానాన్ని (సత్యకాముడిని) పొంది, లోక నిందకు జడిసి, నిజాన్ని దాచిన 'నాగరిక' ఋషి గౌతముడు. వయసులో తాను అనేక పురుషులతో చరించానని, కనుక సత్యకాముడి తండ్రి ఎవరో తెలయదనే అబద్ధంతో గౌతముడిని రక్షించిన అనాగరికురాలు జబాల. ఇద్దరిలో ఎవరు సత్యాన్వేషి అన్నదే సౌదా సందేహం. ఆ సందేహం వెనకనే విజేతల 'సత్యాన్వేషణ' మోసాన్ని బట్టబయిలు చేశాడు.

**సత్యాన్వేషి గౌతముడా, జబాలా ...**

జబాల ప్రకృతిలో కలిసిపోయింది. గౌతముడు ప్రకృతిని జయించాలనుకున్నాడు. నిజానికి సత్యం ప్రకృతిని జయించాలనుకోవడంలో లేదని దానిలో మిళితమైపోవడంలో ఉందని గౌతమ ఋషికి యెన్ని తపస్సులు చేస్తే అర్థం అవుతుంది. సృష్టిలో సృష్టి యైవున్న జబాలకు తప్ప.

సృష్టితో తదాత్మ్యం చెందే రహస్యాన్ని సత్యకాముడికి చెప్పింది జబాల. ప్రకృతి కన్నా తానెక్కువ అనే శ్రేష్టమాన అహంకారము. ప్రకృతి కన్న తాను తక్కువ అనే హీన మాన అహంకారము. ప్రకృతితో తాను సమానమనే సదృశమాన అహంకారము. యీ మూడు అహంకారాలు లేకపోవడమే ఆ రహస్యం. దీన్ని గౌతమ ఋషికి చెప్పడం జబాల వుద్దేశం అయివుండవచ్చు. కానీ సత్యకాముడు చెప్పలేదు....

ఇంత జరిగినా, తన దొంగతనాన్ని, పిరికితనాన్ని మాటల మాయతోనే కప్పాలనుకునే ఆత్మవంచకుడు గౌతమ ఋషి ఇలా అంటాడు ''నాయనా నువ్వు సత్యం చెప్పడానికి వేరవలేదు.

అబ్రాహ్మణుడికి యీ సత్యం శక్యం కాదు. నువ్వు సత్యసంధుడివి, కనుక బ్రాహ్మణుడివి'' బ్రాహ్మణుడి సత్యసంధత, జ్ఞానాన్వేషణలో మోసపుపాలు ఈ స్థాయిలో ఉంటుందని సౌదా వ్యంగ్యం.

కనుక, అధికారాన్ని చేజిక్కించుకున్న తర్వాత విజేతలనబడిన నాగరీకులు ఎంతటి నైచ్యానికి పాల్పడ్డారో, అదే అధికారం తమదైతే అనాగరికులు అంతటి నైచ్యానికి (ప్రతీకారేచ్ఛతో కూడా) పాల్పడే వారు కారని బలంగా నిరూపించడంలో ఉంది సౌదా ప్రతిభ. మానవుడై పుట్టి మానవుడితో తలపడవలసి రావడం యెంతటి దురదృష్టం. భగవంతుడితో తలపడ సిద్ధపడిన వాడెంతటి ధన్యుడు అని ఏకలవ్యుడి స్ఫటిక స్వచ్ఛమైన అంతరంగాన్ని ఆవిష్కరించడంలో, యక్షుల కులగురువు అరకేశిబలి అహింసాయుతమైన యజ్ఞ నిర్వహణా రీతిని వివరించడంలోనూ ఆ ప్రతిభ బైటపడుతుంది. ఒకే భావాన్ని అర్థం చేసుకునే పద్ధతులలోని వైరుధ్యమే వారి వారి జీవన విధానాల్లోని హింసాహింసల వైరుధ్యానికి గుర్తని అరికేశిబలి ద్వారా అన్యాపదేశంగా సూచిస్తాడు సౌదా. సాధువులుగా, అహింసా మూర్తులుగా, ధర్మపరాయణులుగా చిత్రించబడిన ఋషిపుంగవుల చద్మవేషాలను తొలగించి; రాక్షసులుగా, యాగవిధ్వంసకులుగా, ధూర్తులుగా చిత్రించబడిన మూలవాసుల నిష్కల్మష అంతఃకరణని ఆవిష్కరిస్తాడు. శబ్దార్థాలకు అర్ధనారీశ్వరత్వాన్ని (కాళిదాసు- వాగార్థ వివ సంప్రుక్తౌ) ఆపాదించినప్పటికీ, బ్రాహ్మణులు ఒట్టి శబ్దలౌల్యులని సౌదా నిశ్చితాభిప్రాయం. అదే బ్రాహ్మణులారా మీరు వేదముల శబ్దములను మాత్రమే ఆకళించినారు. వాటి అర్థములు జీర్ణము కాలేదని అరికేశిబలి చేత పలికిస్తాడు. వారు వేల్చునది హోమాగ్ని కాదని, యుద్ధజ్వాల అని అంటాడు. అహింసాయుతమైన యజ్ఞమెలా నిర్వహించాలో చెబుతూ, పృథ్వీకాయము అప్కాయము వాయు కాయము అగ్నికాయము వనస్పతికాయము త్రసకాయము అను ఆరు జీవకాయములను హింసించక అసత్య చౌర్యముల పొంతబోక స్త్రీ మానము మాయ వీటి చెంత జేరక అహింసా సత్యాస్తేయ బ్రహ్మ చర్యా పరిగ్రహ పంచసంవరములచే సంవృతులై మర్త్య జీవనమందు లౌల్యము వొదిలి దేహాశక్తిని విడిచి ఆశను అణిచిన వారు శ్రేష్టమైన యజ్ఞము నొనరింతు' రని, తపశ్చర్యయే అగ్ని. జీవుడే అగ్ని గుండము, యోగము స్రుక్కు, శరీరము గోమయము. కర్మలే సమిధలు, సంయమనమే శాంతి అని అయోధ్య మునులకు ప్రభోదిస్తాడు అరికేశిబలి. ఇది 'పరాజితుల' నీతి. భూలోకములో వీరుడు సమస్త శస్త్ర శాస్త్ర ప్రశిక్షితుడు, ధర్మరతుడు, కృతజ్ఞుడు, సత్యవాది, ఆపదలోనైనా ధర్మాన్ని వీడనివాడు, సదాచారసంపన్నుడు, సమస్త ప్రాణకోటికి హితము కోరువాడు, మనోనిగ్రహం కలవాడు, క్రోధాదులను అరికట్టి నిలుచువాడు, తేజస్వి పరోన్నతిని ద్వేషించని వాడు, సమర్థుడు, దర్శనమాత్రముననే అందరికీ ఆనందము కలుగజేయువాడు, యుద్ధమున కోపించినచో దేవతలకైనను భయావహుడు అయిన శ్రీరామచంద్రుడు కౌశిక యాగాన్ని కాచేనెపంతో మలదకరూశ క్షేత్రంలో తారక (తాటకి) ని వధిస్తాడు. ఇది 'విజేతల' నీతి. కనుక ఎవరు విజేత? ఎవరు విజిత? ప్రత్యక్షంగా వేయబడని ఈ ప్రశ్నలోనే, సౌదా చెప్పకనే చెప్పిన సమాధానం కూడా ఉంది. అయితే, సౌదా హృదయం Subaltern జాతుల పక్షాన స్పందించినా, రచయిత నిర్మలత్వంతో నిర్వహించవలసిన నిష్పాక్షిక పాత్రకి సంపూర్ణ న్యాయం చేయడం ద్వారా తన అక్షరాలకు ఎనలేని విలువ ఆపాదించాడతను. సౌదా dispassionate రచనికి శ్రీ కృష్ణ పాత్ర చిత్రణ ఒకానొక ఉత్కృష్ట ఉదాహరణ మాత్రమే. బర్బరీకుడ్ని బలిపెట్టినా, సహదేవుడ్ని వరాలడిగినా, వసుసేనుడ్ని (ప్రసిద్ధ నామం: కర్ణుడు) ప్రలోభపెట్టినా, అచలకు తరుణోపాయం చెప్పినా కృష్ణుడిలో ఏ ద్వైదీభావం లేదు. అణగారిన వర్గాల విముక్తికి, విజయానికి మార్గాలేమిటో తెలిసి కూడా నాగరీకుల (విజేతల) పక్షమే నిలిచాడు. ఆ బడుగు వర్గాలు తమ విముక్తి మార్గాలను తాము అన్వేషించుకోవాలే తప్ప, వేరెవరో మేలు కొలపడం, దున్నగా నిలవడం, వారి తరుపున వకాల్తా తీసుకోవడం కూడదని పరోక్షంగా వివరిస్తాడు.

(సశేషం)



**"ఆదివారం: ఆడవాళ్ళు తమ కేశాలను ఆరబెట్టుకొంటున్నారు"**

చిత్రకారుడు: జాన్స్లో అన్

MISIMI/మిసిమి RNI Regd.No.45042/90 Telugu Monthly, Hyderabad-500 020. Postal Regd. No.H/SD/19



'ఆడవాళ్ళపని"

చిత్రకారుడు: జాన్‌స్లో అవ్